శ్రీః

'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారాయణాచార్య

# శివకర్ణామృతమ్

సరళభావార్థం - ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తి

ప్రతిపదార్థం - ఆచార్య ఇనగంటి ఉమారామారావు



ప్రకాశకులు

డా॥ పుట్టపర్తి నాగపద్మిని

హైదరాబాదు.

శ్రీః

'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారాయణాచార్య

# శివకర్ణామృతమ్

సరళభావార్థం - ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తి
ప్రతిపదార్థం - ఆచార్య ఇనగంటి ఉమారామారావు

ప్రథమముద్రణ : సెప్టెంబరు, 2006
ద్వితీయముద్రణ : 30-03-2023, శ్రీరామనవమి
ప్రతులు : 500
పుటలు : 136
వెల : అమూల్యము



1. డా॥ పుట్టపర్తి నాగపద్మిని
ఇ.నెం.37, తరుణ అవెన్యూ, లక్ష్మీనగర్,
ఈస్ట్ ఆనంద్ బాగ్, మల్కాజిగిరి,
హైదరాబాద్ - 47. సెల్ : 7893976644

2. **R. Mohan Rao, M.Sc., M.A. (Sanskrit),**
510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State
**Cell : 9440115411**

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**KARSHAK ART PRINTERS**
**Hyerabad.**



# శివకర్ణామృతమ్

శేషశైలశిఖరాధివాసినః
కిఙ్కరాః పరమవైష్ణవా వయమ్ ।
తత్తథాఽపి శశిఖణ్డశేఖరే
శాఙ్కరే మహసి లీయతే మనః ॥

– పుట్టపర్తి నారాయణాచార్యః





ఓం శ్రీః

**ఆనందవనం**
భీమునిపట్నం - 531164
విశాఖపట్నం జిల్లా, ఏ.పి.
ఫోను : 08933 229505

డాక్టర్ నాగపద్మిని గారికి శుభాశీస్సులు. 20 ఆగస్టు తేదీగల జాబుతో, సరస్వతీపుత్రుల రచన '**శ్రీశివకర్ణామృతమ్**' డి.టి.పి. కాపీ అందినది. మీరు పంపిన ఇతర గ్రంథములు కూడ అందినవి. కృతజ్ఞుడను.

సరస్వతీపుత్రుల దర్శనమొకమారు పూర్వము చేసియుంటిని. వ్యుత్పన్నులైన వారి ప్రతిమాటా, పాటా లోకమునకు గొప్ప విజ్ఞానదాయకములు. ఈ శివకర్ణామృత శతాధిక శ్లోకరచన ప్రసన్నమధురమై, భక్తిభావోద్దీపకమై ఉండుట ఆశ్చర్యము లేదు. ఆచార్య లక్ష్మణమూర్తిగారి తేటతెలుగు మాటలతో చదువరులకు సుప్రసన్నమై భాసించు చున్నది. మీరు చేయు ఈ గ్రంథముద్రణ సాహిత్యాభిరుచిని సమాజమమునందు వృద్ధి చేయగలదు.

భీమునిపట్నం
7-9-2006. **- శివానందమూర్తి**



**శివకర్ణామృత** కావ్య ప్రథమముద్రణకు సహృదయంతో ఆర్థిక సహాయం చేసిన **వేదమూర్తులు సద్గురు శివానన్దమూర్తిగారికి** ప్రణమిల్లుతూ...

**- పుట్టపర్తి నాగపద్మిని**

# శివకర్ణామృతమ్







**ఆచార్య రవ్వా శ్రీహరి**
**పూర్వ ఉపాధ్యక్షులు**
**ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం**

సరస్వతీపుత్ర బిరుదాంచితులు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు జగమెరిగిన మహావిద్వత్కవులు. చతుర్దశభాషాకోవిదులు. సంగీత సాహిత్యాలలో దిట్టలు. గొప్ప విమర్శకులు. మంచి వక్తలు. శతాధిక గ్రంథ నిర్మాతలు. తమ '**శివతాండవ**' కావ్యగానంతో శ్రోతృజనాన్ని మంత్రముగ్ధం చేసిన మహానుభావులు. శక్తిమంతమైన వారి లేఖిని నుండి వెలువడిన అద్భుతస్తోత్రకావ్యమే ఈ **శివకర్ణామృతం.**

శివకర్ణామృత కావ్యకర్తలు పుట్టపర్తి నారాయణాచార్యులు గారు జన్మతః శ్రీవైష్ణవులు. అష్టాక్షరీ జపపరాయణమానసులు. '**సన్మతి నెల్లప్పుడు మానసంబున నమో నారాయణాయేతి వర్ణతతిన్ ద్రిప్పెడు భక్తుపాదరజములో నా శీర్షమందుండ నిమ్ము, తరింతున్ భవసాగరమ్ము**' అని చెప్పుకున్న నారాయణాచార్యులవారి విష్ణుభక్తి ఎంతటిదో శివునిపై కూడా అంతే భక్తి ప్రపత్తులున్నాయి. శివకేశవుల నిద్దరినీ అభిన్నంగా భావించిన కవివర్యులు ఆచార్యులు గారు. కనుకనే వీరు పరమవైష్ణవులైనా శివపారమ్యాన్ని వర్ణిస్తూ శివభక్తి పారవశ్యంతో '**శివకర్ణామృత**' కావ్యాన్ని రచించినారు.

ఈ విషయాన్నే ఆచార్యుల వారీ క్రింది శ్లోకాల్లో తెలుపుకున్నారు.

**శేషశైలశిఖరాధివాసినః కింకరాః పరమవైష్ణవా వయమ్ ।**
**తత్తథాపి శశిఖండశేఖరే శాంకరే మహసి లీయతే మనః ॥ (49)**

**అష్టాక్షరీజపపరాయణమానసేన శైవాగమాకలనపుంఖితసంభ్రమేణ ।**
**నారాయణేన రచితం నవచంద్రభూషకర్ణామృతం జయతు కామగవీసదృక్షమ్॥(121)**

ఆచార్యులవారి పై శ్లోకాలు, శైవుడైనా శ్రీకృష్ణుని యందపరిమిత భక్తిపారవశ్యంతో శ్రీకృష్ణకర్ణామృతాన్ని రచించిన లీలాశుకిని కింది శ్లోకాన్ని స్మరింపజేస్తాయి.

**శైవా వయం న ఖలు తత్ర విచారణీయం పంచాక్షరీజపపరా నితరాం తథాఽపి।**
**చేతో మదీయమతసీకుసుమావభాసం స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్ ॥**

శివుడు రామనామాన్నీ, కేశవుడు శివనామాన్ని నిత్యం జపం చేస్తారనీ, కనుకనే తపోధనులైన నారదాదులు శివకేశవభేదాన్ని పాటించరని ఆచార్యులవారీ కింది శ్లోకంలో వివరిస్తున్నారు.

**రామనామజపకర్మఠే శివే కేశవే శివజపానువర్తిని ।**
**నారదాదిమునయస్తపోధనాః శైవవైష్ణవభిదాం వితత్యజుః ॥ (74)**

స్తోత్రకావ్యాల్లో సాధారణంగా భగవంతుని రూపాన్ని, గుణగణాలను, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని భక్తితన్మయతతో స్తుతించడం కనిపిస్తుంది. దీనితోపాటు భక్తుడు భగవంతునికి ప్రపన్నుడై వేడుకోవడం కూడా కనిపిస్తుంది. స్తోత్రాల్లో శైలి ఎంతో ప్రసన్నంగా, మృదుభావగర్భితంగా, శబ్దాలంకారశోభితంగా ఉంటుంది. పుట్టపర్తి వారు పై గుణాలనన్నిటినీ మేళవించి శివకర్ణామృతాన్ని చక్కని స్తోత్ర కావ్యంగా, విద్వత్కర్ణామృతంగా తీర్చిదిద్దినారు.

ఆచార్యులవారి కవితాశైలికి ఒక్క ఉదాహరణం –

**నాగేన్ద్రోత్తంసచూడం నటదలకభరం నవ్యరాజీవనేత్రం**
**పీనస్కంధోరుబాహుం ప్రణవపరిచితం బిల్వమాలాభిరామమ్ ।**
**వ్యామగ్రాహ్యస్తనీభిశ్శబరయువతిభిర్వీక్ష్యమాణం సరాగం**
**కైవల్యానందవేశ్మ ప్రవిశతు హృదయే కించిదద్వైతసీమా ॥ (75)**

ఇటు పూర్వార్థంలో శివుని రూపమూ, నాల్గోపాదంలో ఆతని తత్త్వమూ వర్ణింపబడ్డాయి. కవి శాంభవమైన తేజస్సు తన హృదయంలో ప్రవేశించు గాక అని కవి ప్రార్థిస్తూ ఆ తేజస్సు కైవల్యానందానికి వేశ్మ అనీ, అద్వైతానికి సీమ అనీ అంటున్నాడు. శ్లోకంలోని "**కైవల్యానందవేశ్మ, ప్రవిశతు హృదయే కించిదద్వైతసీమా**" అనే వాక్యంలో తేజస్సు అనే శబ్దం – లేకున్నా ఇతర శ్లోకాల్లో శివుణ్ణి తేజోరూపంగా చెప్పడం వల్ల ఇట '**కించిత్**' శబ్దం చేత తేజస్సును గ్రహించాలి. కొన్నిచోట్ల ఆచార్యులవారు శివుడని సాక్షాత్తుగా చెప్పక శైవకాంతి, శైవతేజస్సు అని కాంతిస్వరూపంగా, తేజోరూపంగా వర్ణించడం కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు–

కిమప్యవిదితం ధామ చకాస్తి మమ నేత్రయోః । (64)
కాంతిః కరోతు కృపయా దురితోపశాంతిమ్ । (70)
శాంభవే మహసి లీయతే మనః । (25)
శాంకరే మహసి లీయతే మనః । (49)
నటలీలాపరం మహః । (35)
రటదంసకూటవినిబద్ధకర్పరాఽ –
స్థిచయాభిరామమహసే ధుతాంహసే । (13)
రమణీయం జయతి శాంకరం తేజః । (26)
ప్రసాదరమ్యాననమైశ్వరం మహః । (91)

ఆచార్యులవారి శబ్దాలంకారప్రయోగాలు ఎంతో హృదయావర్జకాలుగా ఉంటాయి. ఒకటి రెండు శ్లోకాలు గమనించండి.

**ప్రమథనాయకం నయనసాయకం – దివ్యగాయకం దీప్తిదాయకమ్ ।**
**శమవిధాయకం సౌఖ్యనేయకం – మదనమర్దినం మృడముపాస్మహే ॥ (78)**

**శ్రితదిగంబరం చికురితాంబరం - కాలకంధరం భావబంధురమ్ ।**
**భువనసుందరం వైరిణాం దరం - రతపురందరం హరముపాస్మహే ॥ (79)**

శ్రుతిసుభగత్వం కల ఇలాంటి శ్లోకాలు మరింకెన్నో ఉన్నాయి. (2,14,18,28, 29,36,27,51,54,77,80 మొ॥)

'కాశీపతిరస్తి కా శుచా మనసః' (116) అని కాశీపతిపైనే భారం వేసిన ఆచార్యులవారి శివభక్తి సముత్కటమైంది. ఆయన హృదయం ఎప్పుడూ గౌరీశ్వరుడైన ఆ శివుణ్ణి దర్శించుకోవాలనే తపిస్తూ ఉంటుంది. ఈ విషయం మనకీ క్రింది శ్లోకపాదాల్లో గోచరిస్తుంది.

**భూతేశ్వరం హృది కదా ను విలోకయిష్యే । (111)**
**సర్వేశ్వరం హృది కదా ను విలోకయిష్యే । (112)**
**గౌరీశ్వరం హృది కదా ను విలోకయిష్యే । (113)**
**నాదేశ్వరం హృది కదా ను విలోకయిష్యే । (114)**

మేఘాలు సముద్రంలో నుండి జలాన్ని గ్రహించి మళ్లీ అక్కడే వర్షించినట్లుగా శివుడనుగ్రహించిన సాహిత్యాన్ని శివునికే నివేదించుకున్నట్లుగా ఆచార్యులుగారు చెప్పుకోవడం వారి నిరహంతను, సమర్పణభావాన్ని వ్యక్తం చేస్తుంది.

**శివేన దత్తం సాహిత్యం శివాయైవ నివేదితమ్ ।**
**వర్షంతి హి పయోర్మేఘాః పునస్తత్రైవ వార్ధిజమ్ ॥ (120)**

ఆచార్యులవారు చెప్పుకున్నట్లుగా ఈ శివకర్ణామృతం నిజంగా కామగవి వృక్షమే.

చివరగా ఒక్కమాట. ఎప్పుడో - దాదాపు ముప్పై ఐదేండ్ల కిందట పుట్టపర్తివారు స్వహస్తాలతో వ్రాసుకున్న వ్రాతప్రతి సాపుప్రతి వ్రాయడానికి ఎవరి ద్వారానో నాచేతికి వచ్చింది. సాపు ప్రతి వ్రాసినట్లే గుర్తు. తరువాత ఈ ప్రతులేమైనాయో నాకు జ్ఞప్తి లేదు. మిత్రులు డా॥ శ్రీరంగాచార్యులు గారు "శ్రీమాన్ పుట్టపర్తి వారు వ్రాసియుంచుకున్న కాగితాల నుండి ఉద్ధరించి వ్రాసినాను. దీనిని పుట్టపర్తి వారు చూచిరి. వారికి ఒక ప్రతిని వ్రాసి ఇచ్చినాను. దీన్ని వివరణతో ముద్రించవలెనని అన్నారు" అని పేర్కొన్నారు. బహుశః సాపు ప్రతిని వ్రాయమని నేనే శ్రీరంగాచార్యులవారిని కోరినానేమో! ఏమైనా డా॥ శ్రీరంగాచార్యులుగారు సాపు ప్రతిని ఇంతకాలం భద్రంగా ఉంచి సాహితీలోకానికి ఎంతో ఉపకారం చేసినారు.

పుట్టపర్తి వారి పుత్రిక డా॥ శ్రీమతి నాగపద్మిని గారు ఎంతో శ్రద్ధతో తండ్రిగారి కోరిక ప్రకారం ఈ గ్రంథాన్ని ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తిగారి వివరణంతో ముద్రించి పితౄణం తీర్చుకున్నందుకు వారిని అభినందిస్తున్నాను.

శివకర్ణామృతం కావ్యం నారాయణవినిర్మితమ్ ।
వావర్ధతాం శైవతత్త్వప్రతిపాదకమాజగత్ ॥

**- రవ్వా శ్రీహరి.**

# ఏమానందము...

ఈ క్షణాలు ఉత్సాహ, ఉత్కంఠ భరితంగా ఉన్నాయి. రచనా కాలం తరువాత దాదాపు యాభై సంవత్సరాలకు ముద్రణ భాగ్యానికి నోచుకుంటున్న '**శివకర్ణామృతమ్**' చతుర్దశభాషాగహనవీథీవిహారి పద్మశ్రీ డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి సంస్కృత రచన. వారు అభిలషించినట్లు – భావార్థంతోడే వెలువడుతుండటం – నా ఉత్సాహానికి ఉద్వేగానికి కారణం.

**శివకర్ణామృతమ్** వ్రాతప్రతి దొరకక మా అయ్యగారు పుట్టపర్తివారు చాలా ఆవేదన చెందటం నాకు తెలుసును. గజ్జెల మల్లారెడ్డి గారన్నట్టు పట్టువిద్య ఎరుగని, పైరవీలు తెలియని కవితావిద్యమాత్రమే తెలిసిన ఆ సాహిత్య'రవి' ఎప్పుడూ వాపోతూనే వుండేవారు. 'నా రచన ఏనాడు వ్రాసిన వెంటనే ముద్రింపబడలేదు' అని! '**శ్రీనివాసప్రబంధమూ**', '**పండరీభాగవతము**', '**జనప్రియరామాయణం**' వంటి రచనలన్నీ వ్రాతప్రతి రూపంలో వుండగానే ప్రసిద్ధలై తరువాత ఎంతకాలానికో ప్రచురింపబడ్డాయి. కానీ **శివకర్ణామృతమ్** వ్రాతప్రతే అసలు వారికి లభ్యం కాలేదు.

వారు కీర్తికాయులైన తరువాత 2000–2001 ప్రాంతాల్లో ఆ వ్రాతప్రతి **పాలెం సంస్కృత కళాశాల** అప్పటి ప్రిన్సిపాల్ శ్రీరంగాచార్యుల వారి ద్వారా లభ్యం కావటం కేవలం నా అదృష్టమే! ఆ ప్రతిని అలకిని అందుకున్న వెంటనే దానిని ముద్రించాలన్న నా ఉత్సాహానికి అడ్డుకట్ట వేశాయి. చివరి వాక్యాలు : "శ్రీమాన్ పుట్టపర్తి వ్రాసి యుంచుకున్న కాగితాల నుండి ఉద్ధరించి వ్రాసిన దీనిని పుట్టపర్తి వారు చూచిరి. వారికి ఒక ప్రతిని వ్రాసి యిచ్చినాను. దీనిని వివరణతో ముద్రించవలెనని" అన్నారు – శ్రీరంగాచార్య 11.05.1964. మా అయ్యగారి అభీష్టం మేరకు వివరణతో సహా ముద్రించవలెనన్న నా తాపత్రయం యీ నాటికి – కార్యరూపం దాల్చటానికి కారణం నా వరంగల్ ఆకాశవాణి కేంద్రానికి బదిలీ.

2003లో బదిలీమీద అక్కడికి వెళ్ళినపుడు అక్కడ సాహిత్య కార్యక్రమాలకు సాహితీ దిగ్దంతులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారు, ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య గారు, ఆచార్య మాదిరాజు రంగారావు గారు, ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తిగారు, ఆచార్య అనుమాండ్ల భూమయ్యగారు, ఆచార్య కాత్యాయనీ విద్మహే గారు, డాక్టర్ అంపశయ్య నవీన్ గారు, డాక్టర్ శ్రీరంగస్వామి గారు, శ్రీగిరిజా మనోహర్ బాబు గారు, శ్రీ నాగిళ్ళ రామశాస్త్రి గారు, డాక్టర్ వఝ్ఝల రంగాచార్య గారు, ఆచార్య హరి సనత్‌కుమార్ గారు, శ్రీ పొట్లపల్లి శ్రీనివాసరావు గారు, శ్రీదర్భశయనం శ్రీనివాసాచార్య గారు వీరంతా తరచూ విచ్చేసే వారు.

సాహిత్య వాతావరణంతో సదా పరిమళభరితంగా వుండేదా కేంద్రం ఎప్పుడూ. ముఖ్యంగా ఆచార్య శ్రీ లక్ష్మణమూర్తిగారు మా అయ్యగారి అసమానసాహితీప్రకర్ష, అనితరసాధ్య-సాహిత్యసృష్టి, ఋషితుల్యసాహితీతపోనిష్ఠ గురించి అనర్గళంగా ఆర్ద్రంగా మాట్లాడుతుంటే నా కళ్ళు చెమర్చేవి. 1963 – 64 ప్రాంతాలలో న్యూసైన్స్ కళాశాలలోని ఆంగ్లవిభాగంలో పనిచేస్తున్న సమయంలో పుట్టపర్తి వారిని తమ సోదరులు శ్రీరంగాచార్యులు, ఆచార్య రవ్వా శ్రీహరి గారలతో తరచూ కలవటం, సాహిత్యచర్చల్లో పాల్గొనటం, వారి సాహిత్యాన్ని ఆరాధనా భావంతో పఠించటం – యివన్నీ వారి మాటల్లోనే వింటుంటే నాకక్కడ మరో పుట్టిల్లు లభించినంత సంబరం కలిగేది. సంస్కృతాంధ్రాంగ్లాల్లో అద్వితీయ ప్రతిభా సంపన్నులు మనస్వి, శ్రీమాన్ శ్రీ లక్ష్మణమూర్తిగారి ముందు ఓసారి నా అభ్యర్థన నుంచాను – 'అయ్యగారి '**శివకర్ణామృత**' సంస్కృతరచనకు భావార్థం వ్రాస్తారా!' అని! వారు వెంటనే అంగీకరించారు. వ్రాతప్రతి లభించిన వైనం విని శ్రీరంగాచార్యులుగారూ కలిసి **శివకర్ణామృతమ్** శుద్ధప్రతిని తయారుచేశారనీ గూడా చెప్పారు. శ్రీరంగాచార్యుల వారి వద్ద లభించిన వ్రాతప్రతిని మళ్ళీ శ్రీగిరిజా మనోహర బాబు తమ ముత్యాలకోవ వంటి వ్రాతలో తీర్చిదిద్దగా, శ్రీలక్ష్మణమూర్తిగారు సులభసుందరభావార్థాన్ని మూలం వలనే కోమలకాంతపదావళీ విలసితంగా, నిసర్గరమణీయంగా, మనోజ్ఞంగా కూర్చారు. డి.టి.పి.లో తప్పొప్పులనూ ఓపికగా వారే సవరించారు. అంతేకాదు ఈ కావ్యానికి అనుబంధంగా ప్రచురించిన అయ్యగారి విశ్వవిఖ్యాత రచన "**శివతాండవమ్**" లోని శ్లోకాలకు కూడా భావార్థాన్ని సమకూర్చారు. "**శివకర్ణామృతమ్**" చివరి శుద్ధప్రతిని ఆచార్య రవ్వా శ్రీహరిగారు సహృదయంతో సరిదిద్ది ఈ మహత్కార్యంలో సహకరించారు. శివకర్ణామృత కావ్యాన్ని విద్వత్కర్ణామృతంగా అభివర్ణిస్తూ ముందుమాట కూడా వ్రాశారు.

మొత్తానికి నలభై ఐదు సంవత్సరాల క్రితం పుట్టపర్తి వారి కలం నుండి అక్షరరూపం దాల్చిన '**శివకర్ణామృతమ్**' ఈ నాటికి సాహితీ సరస్వతి అపురూప కంఠమాలగా అలంకరింప బడుతున్నది. ఈ సందర్భంగా ఈ మిత్రత్రయానికి నేను సదా ఋణగ్రస్తురాలిని!

భారతీయ సంస్కృతీ ప్రాచీన పునరుద్ధరణలో అవిశ్రాంతంగా కృషి చేస్తూ, గురు సంప్రదాయ వైశిష్ట్యాన్ని విశ్వహృదయంపై ప్రతిష్ఠింపజేస్తున్న సద్గురు శ్రీశివానందమూర్తి గారు, యీ గ్రంథముద్రణకై ఆర్థికసహాయం చేయటమే కాక ఆశీస్సులనూ అందించారు. వారికి నా వినయాంజలులు.

ఇక కడప జిల్లా ప్రొద్దుటూరు నడిబొడ్డున పుట్టపర్తి వారి కాంస్యవిగ్రహం ప్రతిష్ఠించబోతున్న వార్త వెనుక పుట్టపర్తి సాహితీపీఠం కార్యదర్శి జింకా సుబ్రహ్మణ్యం

అకుంఠితదీక్ష, తపస్సూ, అక్కడి జనవాహిని ఆత్మీయతా బంధం ఎంతో పటిష్టంగా, ప్రత్యక్షంగా సమీక్షంగానూ వుండటం కారణం. ఒక మహాకవి కీర్తికాయులైన ఒక్క సంవత్సరానికే (1991లో) వారి విగ్రహస్థాపనను జరిపి, వారిని గుండెల్లో నిల్పుకోవడం తెలుగు నేల మీద ఒక్క పుట్టపర్తికే చెల్లింది. గత సెప్టెంబర్ మాసంలో కొన్ని రాజకీయ–శక్తులు 15 సంవత్సరాల క్రితం స్థాపించిన ఆ విగ్రహాన్ని తొలగించినప్పుడు అక్కడి ప్రజానీకం ధర్నాల్లోనూ, నిరసన ప్రదర్శనల్లోనూ పాల్గొనటం చూసి, మా అయ్యగారి పట్ల అక్కడి ప్రజల అభిమానానికి మనసు ద్రవించి పోయింది. అన్ని రాజకీయ పార్టీలూ, కొందరు అధికారపార్టీ నాయకులూ, ప్రముఖ సాహితీవేత్తలూ సైతం విగ్రహం తొలగింపు పట్ల అసంతృప్తి వ్యక్తం చేయటం వెనుక శతాధిక గ్రంథకర్తగా, నిర్విరామ సాహితీ జిజ్ఞాసువుగా, నిష్కళంక సాహిత్య సేవకునిగా, శేముషీ వైభవ సంపన్నులుగా అయ్యగారికున్న గుర్తింపు తెలిసివచ్చింది.

రెండోసారి కాంస్యవిగ్రహస్థాపన జరుగబోతుండటం – మరోమారు పుట్టపర్తి ఇలపై అవతరించినట్లే!

'రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా' ప్రసన్నమైన జలం సజ్జనుని మనస్సులా రమణీయమన్నారు వాల్మీకి. యీ గ్రంథముద్రణలో ఇలాంటి ఎంతో మంది సజ్జనుల సహకారం లభించడం మా అయ్యగారు – పుట్టపర్తి వారి సాహితీ మూర్తిమత్వానికి నిలువుటద్దం.

ప్రముఖుల నుంచి మా అయ్యగారు అందుకున్న లేఖలు, వ్రాసిన లేఖ, వివిధ సభల్లో వారు పాల్గొన్న ఛాయా చిత్రాలు చివరి పేజీల్లో పొందుపరచటం జరిగింది.

గ్రంథ ముద్రణలో ఎప్పటిలాగే సహకరించిన అంకుశ్ గ్రాఫిక్స్, చి.సౌ. క్రాంతికీ, ఆకృతి ప్రింటర్స్ కిరణకూ కృతజ్ఞతలు.

'**శివకర్ణామృతమ్**'లో పుట్టపర్తివారి పరిణతప్రజ్ఞ, మధుమయపణితి, మరందధారా–శోభితమైన కవిత్వమధుపానానికి – సాహితీపిపాసువులకు స్వాగతం!



వినమ్రంగా

**పుట్టపర్తి నాగపద్మిని**

# మల్లీపుష్పోమద్యుతి

మా అయ్యగారు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారి కీర్తికిరీటంలో అత్యంత విలువైన వజ్రం – **శివతాండవం**. కేవల రచనా రూపంలోనే కాక, అయ్య ఆ రచనను నాట్య సహితంగా గాత్రంతో గానం చేస్తూ ఉంటే, కైలాసమే కళ్ళముందు సాక్షాత్కరించినట్లు ఉండేదని, ఆ అమృతోపమానమైన అనుభూతిని ఇంకా పదిలంగా దాచుకునే ఉన్నామని చెప్పే ఆనాటి తరం అదృష్టవంతులైన వయోవృద్ధులు నిన్న మొన్నటివరకూ, నాకు అక్కడక్కడా తారస పడుతూనే ఉండేవారు. 1960ల నుండి, అనేకసభలకు అయ్యతో పాటు నేను వెళ్తున్నప్పటినుండి వెళ్ళినప్పటినుండి, మాత్రం (అయ్య అప్పటికి 50వ పడిలో ఉన్నారు) అయ్య గంభీర ముద్రతో అనేక వేదికలమీద గానం మాత్రం చేస్తుండేవారు! వారి గంభీర పఠనావేశానికి ఉద్రూతలూగిపోతూ అశేష సాహితీప్రియులు అభినందనల వర్షంలో అయ్యను తడిపివేయటం – కళ్ళారా చూశాను. ఎన్నోసార్లు!! నేను కూడా వారి కవితాగానాన్ని తన్మయీభావంతో, దిగ్భ్రాంతితో, అనేక వేదికల మీద వింటూ, వారి కుమార్తెగా జన్మించిన నా అదృష్టానికి మురిసిపోయినదాన్నే!! శ్రీవైష్ణవ కుటుంబంలో జన్మించినా, శివతాండవ ఖండ కావ్య రచనతో, అఖండప్రశస్తిని పొందిన పుట్టపర్తి వారి యీ **శివకర్ణామృతం** కూడా వారి సంస్కృత రచనా సామర్థ్యానికి అద్దం పడుతున్నది.

1960 లలో రచించిన తరువాత, దాదాపు యాభై సంవత్సరాలకు, అయ్య వ్రాత ప్రతిలో ఒకచోట తన మనోభిష్టాన్ని వ్రాసిపెట్టుకున్నట్లే, సువిఖ్యాత ఆంధ్రాంగ్లాచార్యులు ఆచార్య శ్రీ పెరుంబుదూరు శ్రీలక్ష్మణమూర్తి గారి తెలుగు అనువాదంతో సహా 2006 సం.లో నేను ప్రచురించగలిగాను. భారతీయ ప్రాచీన సంస్కృతి పునరుద్ధరణలో అహరహమూ తపించి, సద్గురుగా హితోపదేశామృతధారలతో సస్యకేదారాలను సంస్కృతీమంతం చేసిన **శివానందమూర్తిగారు** దయతో ప్రచురణకై ద్రవ్య సహాయం చేశారు. 'రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా...' అని వాల్మీకి అనటం, (సజ్జనుల హృదయాలవలె ప్రసన్నజలం ఉన్నదట) ఇటువంటి వారికోసమేనోమో!!

అటువంటి మరో సజ్జనులు, రావి మోహనరావుగారు కూడా! అనేక సంస్కృత గ్రంథాలను అర్థతాత్పర్యాలతో సహా ప్రచురిస్తూ, సంస్కృతభారతీసేవలో తరిస్తూ,



శ్రీః

# శివకర్ణామృతమ్

శ్లో॥ కలానిధికలావతీకలితజూటవాటీలస-
త్రివిష్టపతరఙ్గిణీలలితతాణ్డవాడమ్బరః ।
మదాఞ్చితవిలోచనో మధురముగ్ధవేషస్సదా
పరిస్ఫురతు మానసే గిరిసుతానురాగాఙ్కురః ॥ **1**

కలానిధి = చంద్రునియొక్క, కలావతీ = కళ కలిగి, కలిత = తెలియబడిన, జూట = శివుని జడలో, వాటీ = చుట్టుకొని, లసత్ = ప్రకాశించు, త్రివిష్టప = స్వర్గమునకు సంబంధించిన, తరంగిణీ = గంగానదివలె, లలిత = సుందరమైన, తాండవ = (పురుష) నృత్యంతో, ఆడంబరః = శోభిల్లువాడు, మదాంచిత = మత్తెక్కిన, విలోచనః = కన్నులు కలవాడు, మధుర = మధురమైన, ముగ్ధ = మనోహరమైన, వేషః = వేషం కలవాడు, గిరిసుతా = మంచుకొండ కూతునకు, అనురాగాంకురః = ప్రేమాంకుర రూపుడయిన శివుడు, మానసే = మనస్సునందు, సదా = ఎల్లప్పుడు, పరిస్ఫురతు = నిండుగ ప్రకాశించు గాత!

చంద్రవంకతో విరాజిల్లే జటాజూటంలో నడయాడు గంగానదీ మృదుల తాండవంతో శోభిస్తూ, మదాలసమైన కన్నులతో, అందంగా ఆకట్టుకునే వేషంతో పార్వతీప్రేమాంకుర రూపుడైన శివుడు మానసమునందు ప్రకాశించుగాక!





శ్లో॥ విభూతిపరిశోభితం ప్రచురభూతిసంశోభితం
కరాఞ్చితకపాలినం గగనసంగ్రసచ్ఛూలినమ్ ।
నరాస్థిచయమాలినం సకలలోకసమ్పాలినం
దధీమహి హృది ప్రియం మదనగర్వసర్వఙ్కషమ్ ॥ 2

విభూతి = విభూతితో, పరిశోభితమ్ = అలరారువాడు, ప్రచుర = అధికమైన, భూతి = ఐశ్వర్యంతో, సంశోభితమ్ = విరాజిల్లువాడును, కరాంచిత = చేతియందు రాజిల్లు, కపాలినమ్ = కపాలం కలవాడును, గగనసంగ్రసత్ = ఆకాశమును మ్రింగు, శూలినమ్ = శూలం కలవాడును, నర = నరుల, అస్థి = ఎముకల, చయ = సమూహము, మాలినమ్ = మాలగ గలవాడును, సకలలోక = లోకములన్నింటిని, సంపాలినమ్ = బాగుగ పాలించువాడును, మదన = మన్మథుని, గర్వ = మదమును, సర్వంకషమ్ = నిర్మూలించిన శివుడు, హృది = హృదయమునందు, ప్రియమ్ = ఇష్టముగ, దధీమహి = నిలుపుకుందాము.

విభూతితో అలరారుతూ, విస్తారమైన సంపదతో ఒప్పారుతూ, చేతిలో కపాలాన్ని ధరించి, ఆకాశమంత ఎత్తుగా వ్యాపించి; అస్థికలను మాలగా వేసికొని, అన్ని లోకాలని పాలిస్తూ, మన్మథుని గర్వాన్ని నిశ్శేషంగా రూపుమాపిన ప్రీతిపాత్రుడైన శివుణ్ణి మనస్సులో నిలుపుకుందాం.





శ్లో॥ దయారసతరఙ్గితం కమపి గౌరదేహం వహన్
తుషారగిరిమస్తకే విలసితస్సుపర్వాదిభిః ।
కఠోరవృజినాటవీపటలభస్మసాత్కర్మఠ-
శ్చకాస్తు నిటలామ్బకస్సతతమార్ద్రతన్ద్రే హృది ॥ 3

దయారసతరంగితమ్ = దయయను రసతరంగాలతో నిండిన, కమ్+అపి = చెప్పనలవికాని, గౌరదేహం వహన్ = తెల్లనైన దేహం కలవాడు, తుషారగిరి = మంచుకొండయొక్క, మస్తకే = శిఖరమందు, సుపర్వాదిభిః = దేవతలతో, విలసితః = విరాజిల్లువాడును, కఠోర... కర్మఠః : కఠోర = కఠోరమైన, వృజిన = పాపమనే, అటవీ = అడవుల, పటల = సముదాయమును, భస్మసాత్ = బూడిదగా చేయు, కర్మఠః = దక్షుడు, నిటలాంబకః = నుదుట కన్నుగలవాడు, అయిన, ఆర్ద్రతంద్రే = ప్రేమతో తడిసిన, హృది = (నా) గుండెలో, చకాస్తు = ప్రకాశించు గాక!

దయారసం నిండారే తెల్లని దేహంతో హిమగిరి తటంపై దేవతలతో కొలువుదీరిన, కఠోరమైన పాపాటవిని దహించి బూడిదగా చేసిన, నిటలాక్షుడు ప్రేమార్ద్రమైన హృదయంతో ప్రకాశించుగాక!





**శ్లో॥ పరాపరపరంపరాపరిణతాత్మవాదాదిభి-**
**స్సనాతన ఉదఞ్చితస్సతతరాగభావార్ద్రితః ।**
**సదాఽవతు తదర్చకద్రుహిణముఖ్యదేవావలీ-**
**శిరస్తలసముల్లసల్లలితపాదపద్మో హరః ॥ 4**

పరాపర... వాదిభిః : పర = పరుడని, అపర = అపరుడని, పరంపరా = పరంపరలుగ, పరిణత = పండిన, ఆత్మవాదాదిభిః = ఆత్మనుగూర్చి చేయు వాదముల (చేత), సనాతనః = పూర్వమైనవాడుగ, ఉదంచితః = పూజితుడు, సతత... భావార్ద్రితః : సతత = ఎల్లపుడు, రాగ = ప్రేమ, భావ = భావంతో, ఆర్ద్రితః = తడిసినవాడు, తదర్చక... పాదపద్మః : తదర్చక = తనను అర్చించు, ద్రుహిణముఖ్య = బ్రహ్మ మొదలైన, దేవావలీ = దేవతల గుంపు యొక్క, శిరస్తల = తలల తలమునందు, సముల్లసత్ = విరాజిల్లు, లలితపాదపద్మః = లలితమైన పద్మాలవంటి పాదములు గల, హరః = శివుడు, సదా = ఎల్లపుడు, అవతు = రక్షించుగాక!

పరమూ, అపరమూ అనే పదాలతో నిబిడమైన ఆత్మవాదాలకు అందనివాడు, సనాతనుడు, ప్రేమపూర్ణమైన ఆర్ద్రమనస్కుడు, ఆనందపరవశులైన బ్రహ్మాది దేవతల శిరస్సులపై తన పాదపద్మాలను అనుగ్రహించిన శివుడు ఎల్లకాలము రక్షించుగాక!





శ్లో॥ మరాలమదమర్దనప్రథితయానవిద్యాధరీ-
కరాఞ్చితకలక్వణత్కనకకఙ్కణాడమ్బరమ్ ।
చిరం సముపసేవితస్సితఘనోపమైశ్చామరై-
ర్హరో వసతు మే లుఠజ్జలనిబద్ధయోర్నేత్రయోః ॥ 5

మరాల... డంబరమ్ : మరాల = హంసలయొక్క, మద = మదమును, మర్దన = పోగొట్టుటయందు, ప్రథిత = ప్రసిద్ధమైన, యాన = నడకలు గల, విద్యాధరీ = విద్యాధరస్త్రీల, కరాంచిత = చేతలయందు, కలక్వణత్ = ఇంపుగమ్రోగు, కనకకంకణ = బంగారు కంకణాల, ఆడంబరమ్ = ఆడంబరముగ, సితఘనోపమైః : సిత = తెల్లనైన, ఘన = మేఘాలతో, ఉపమైః = పోల్చదగిన, చామరైః = వింజామరలతో, చిరమ్ = చాలకాలంగ, సముపసేవితః = బాగుగసేవింపబడిన, హరః = శివుడు, మే = నా యొక్క, లుఠ... నిబద్ధయోః : లుఠత్ = కారుచున్న (దొర్లుచున్న) జల = నీటితో, నిబద్ధయోః = నిండిన, నేత్రయోః = కన్నులందు, వసతు = ఉండుగాక!

అందమైన నడకలతో హంసల గర్వాన్ని హరించే విద్యాధర కాంతలు అవ్యక్త మధురమైన తమ కంకణ ధ్వనితో తెల్లని చామరములను వీస్తూ సేవించబడే శివుడు, ఆనందాశ్రువులతో నిండిన కన్నుల ముందు కన్పించుగాక!





**శ్లో॥ తుషారగిరికన్యకావిపులలోచనాకేకర-**
**స్సితార్ద్రనవమల్లికాసుభగదృష్టినిష్ఠీవితః ।**
**గజాసురశితక్షతప్రథితదన్తకోటిజ్వల-**
**త్కిణాఙ్కపరిభూషితస్స్మరహరస్సమారక్షతు ॥ 6**

తుషార... ఆకేకరః : తుషారగిరి = మంచుకొండ, కన్యకా = పుత్రికయొక్క, విపుల = విశాలమైన, లోచన = కన్నులతో, ఆకేకరః = ఓరగచూడబడువాడు, సితా... దృష్టినిష్ఠీవితః : సిత = తెల్లనైనవి, ఆర్ద్ర = తడిసిన, నవమల్లికా = మల్లెపూలవలె, సుభగ = అందమైన, దృష్టి = చూపులతో, నిష్ఠీవితః = చూడబడువాడు, గజాసుర... భూషితః : గజాసుర = గజాసురునియొక్క, శితక్షత = వాడిగ గాయం చేయుట, ప్రథిత = గొప్పదైన, దంత కోటి = దంతపు కొన, జ్వలత్ = ప్రకాశించు, కిణాంక = కాయకాచిన మచ్చతో, పరిభూషితః = బాగా అలంకరింపబడినవాడు, స్మరహరః = మదన శత్రువు (శివుడు), సమారక్షతు = బాగుగ రక్షించుగాక!

చిఱునవ్వులు చిందిస్తున్న పార్వతీదేవి విపులనేత్రాల్లో వెలుగొందే చూపులే మల్లికా-పుష్పాలుగా, గజాసురుని వాడియైన దంతాలరాపిడి వలన కాయగాచిన శరీరంతో శోభించే మదనాంతకుడు రక్షించుగాక!





శ్లో॥ మునీశ్వరగణావనాయతవిలోచనప్రస్రవ-
త్కృపాసలిలకర్దమత్తుహినపర్వతోపత్యకమ్ ।
పృదాకువిభుకఙ్కణం చికురపర్యటత్కఙ్కణం
స్మరామి విధుశేఖరం విబుధశేఖరం శూలినమ్ ॥ 7

మునీశ్వర... పత్యకమ్ : మునీశ్వర = ఋషిశ్రేష్ఠుల, గణ = సముదాయమును, అవన = రక్షించుటకై ఆయత = విశాలమైన, విలోచన = కన్నులనుండి, ప్రస్రవత్ = జాలువారు, కృపాసలిల = దయయను నీటితో (తడిసి), కర్దమత్ = బురదయిన, తుహినపర్వత = మంచుకొండయొక్క ఉపత్యకమ్ = సానువులు కలవాడు, పృదాకువిభుకంకణమ్ : పృదాకువిభు = నాగరాజును, కంకణమ్ = కరభూషణముగ కలవాడు, చికుర = శిరోజములందు (తలజుట్టులో), పర్యటత్ = బాగా తిరుగు, కం+కణమ్ = నీరు కలవాడును, విధుశేఖరమ్ = చంద్రచూడుడు, వి–బుధశేఖరమ్ = దేవతలలో శ్రేష్ఠుడు, అయిన, శూలినమ్ = శూలం ధరించిన శివుణ్ణి, స్మరామి = తలచుచుందును.

మునీశ్వరులను రక్షించే విశాలనేత్రాలనుండి జాలువారు కృపాజలంతో హిమవత్పర్వత సానువులు తడిసిపోయినాయి. మహాసర్పాలను కంకణాలుగా ధరించినాడు. జటాజూటంలో నీరు నిండారింది. చంద్రరేఖను శిరోభూషణంగా చేసుకున్నాడు. శూలాన్ని ధరించిన ఆ మహాదేవుణ్ణి స్మరిస్తున్నాను.





శ్లో॥ స్మితసుమనసగుచ్ఛో రక్తజూటీకిసాక్తః
సురసముదయబాష్పైస్సన్తతం సిక్తపాదః ।
భుజయుగదృఢశాఖః పుణ్యమాత్రేణ లభ్యో
వితరతు మదభీష్టం శామ్భవః కల్పవృక్షః ॥ 8

స్మితసుమనసగుచ్ఛః : స్మిత = చిఱునవ్వు అనే, సుమనసగుచ్ఛః = పూలగుత్తులు కలది, రక్తజూటీకిసాక్తః = ఎఱ్ఱని జటాజూటమనే చిగురుటాకులు కలది. సురసముదయబాష్పైః = దేవతలకు వచ్చు ఆనందబాష్పాలతో, సంతతమ్ = ఎల్లపుడు, సిక్తపాదః = తడిపిన వేరులు కలది, భుజయుగదృఢశాఖః = భుజముల జంటయే దృఢమైన శాఖలు కలది. పుణ్యమాత్రేణ = పుణ్యమాత్రము చేతనే, లభ్యః = పొందదగిన, శాంభవః = శివుడు, కల్పవృక్షః = కల్పవృక్షము, మత్+అభీష్టమ్ = మా కోరికను, వితరతు = అనుగ్రహించుగాక!

ఆయన చిఱునవ్వు పూగుత్తివలె ఉన్నది. ఎఱ్ఱని జటాజూటం చివురుటాకులా ఉన్నది. దేవతల ఆనందబాష్పాలతో నిరంతరం ఆయన పాదాలు తడిసిపోతున్నాయి. ఆయన భుజాలు బలమైన శాఖల్లా ఉన్నాయి. ఆయన నిజంగా శంభుని రూపంలో ఉన్న కల్పవృక్షం. అది కేవలం పుణ్యంతో లభ్యమౌతుంది. ఆ కల్పవృక్షం నా కోరికలను అనుగ్రహించుగాక!





**శ్లో॥ అర్ధజానిరవతాచ్ఛిపివిష్టో**
**నేతి నేతి వచసా ప్రతిపాద్యః ।**
**అన్తరేణ కరుణాం న నివృత్తి-**
**ర్యస్య జన్మశబలస్య నృజన్తోః ॥ 9**

అర్ధజానిః = శరీరసగంలో భార్యను కలవాడు, శిపివిష్టః = యజ్ఞరూపమున పశువులందు ఉండువాడు, న + ఇతి న + ఇతి = ఇది కాదు, ఇది కాదు (అను), వచసా = వేదవాక్కుచే, ప్రతిపాద్యః = ప్రతిపాదింపబడువాడు, అయిన, యస్య = శివునియొక్క, కరుణామ్+అంతరేణ = దయలేకుండగ, జన్మశబలస్య = జన్మపరంపరగల, నృజంతోః = నరరూపజంతువునకు, న+నివృత్తిః = ఆనందం కలుగదు.

ఆయన అర్ధశరీరంలో భార్యను ధరించినవాడు. కేవలం 'నేతి నేతి' పదాలతో ప్రతిపాదింప యోగ్యుడు. ఆయన దయలేనిదే ఆనేక జన్మవ్యాకులుడైన మానవునికి మోక్షం లభించదు.





**శ్లో॥ న శ్రుత్యా న బహుధా తపసా**
**నార్చనేన న జపేన దమేన ।**
**భావభక్తిరసికశ్శశిచూడ-**
**స్సర్వదా మమ పురః ప్రసర్పతు ॥ 10**

శ్రుత్యా = వేదముచే, న = తెలియబడువాడు కాదు, బహుధా = అనేకరకములైన, తపసా = తపస్సుచే, న = లభ్యుడుకాదు. అర్చనేన = పూజవలన, న = పొందబడువాడు కాడు, జపేన = జపంచేయడం వలన, దమేన = ఇంద్రియనిగ్రహం వలన, న = ప్రత్యక్షం కాడు (కాని), భావభక్తిరసికః = మనస్సున కలిగిన భక్తిమాత్రంచే ఆనందపడు, శశిచూడః = చంద్రశేఖరుడు, మమ పురః = నా ముందు, సర్వదా = ఎల్లపుడు, ప్రసర్పతు = కదలాడుగాక!

వేదంకానీ, తపస్సుకానీ, అర్చనకానీ, జపంకానీ, దమంకానీ ఆయనను ప్రసన్నం చేసికోలేవు. కేవలం భక్తిభావం చేతనే ఆయన వశుడౌతాడు. చంద్రుణ్ణి జటాజూటంలో ధరించిన ఆ శివుడు ఎల్లప్పుడూ నాముందు కన్పించుగాక!





శ్లో॥ గురవే నమో౽స్తు మురవైరిమస్తక-
ప్రలసన్మణీగణవిరాజితాఙ్ఘ్రయే ।
నవసాన్ధ్యవర్ణగజకృత్తివాససే
భువనావనాయ దృఢచిత్తమూర్తయే ॥ 11

మురవైరి ... తాఙ్ఘ్రయే : మురవైరి = మురాసుర శత్రువయిన విష్ణువుయొక్క మస్తక = శిరస్సున, ప్రలసన్ = ప్రకాశించు, మణీగణ = మణులసమూహంతో, విరాజిత = ప్రకాశించిన, అంఘ్రయే = పాదములు గలిగి, నవసాంధ్యవర్ణ = లేత సంధ్యారాగం గలిగి, గజకృత్తివాససే = గజచర్మం ధరించిన, భువనావనాయ = పదునాలుగు లోకాలను రక్షించుట కొఱకు, దృఢచిత్తమూర్తయే = స్థిరమైన చిత్తం గల, గురవే = (గొప్పవాడయిన) గురువునకు, నమః + అస్తు = నమస్కారము (చేయుదును).

ఆయన పాదపద్మాలు విష్ణుశిరస్తలంపై వెలిగే మణులతో విరాజిల్లుతున్నాయి. సంధ్యారుణ కాంతితో తొణికిసలాడే గజచర్మాన్ని ధరించినాడు. చతుర్దశ భువనాలను రక్షించడానికి దృఢసంకల్పం చేసినవాడు. ఆ మహితాత్ముడైన శివునకు నమస్కారము.





శ్లో॥ గురవే నమోఽస్తు నిటలాక్షబంభ్రమ-
ల్లయవహ్నిలీఢగగనాయ భాస్వతే ।
ఘనతాణ్డవాభిముఖవక్త్రనిర్గమ-
ద్విపులాట్టహాసమహతే స్వయమ్భువే ॥ 12

నిటలా... గగనాయ : నిటల = (ఫాలభాగమందు) నొసటనగల, అక్ష = కన్ను నుండి, బంభ్రమత్ = విచలించు, లయ = ప్రళయకాలపు, వహ్ని = అగ్నిచే, లీఢ = తాకుచున్న, గగనాయ = ఆకాశము గలవాడు, భాస్వతే = తేజోరూపుడు, ఘన... మహతే : ఘన = గొప్పదైన, తాణ్డవ = తాండవమునకు, అభిముఖ = ఎదురుగ, వక్త్ర = ముఖము నుండి, నిర్గమత్ = వెలువడు, విపుల = విపులమైన, అట్టహాస = అట్టహాసంతో, మహతే = గొప్పవాడు, స్వయంభువే = తనంతటతానుగ ఆవిర్భవించినవాడయిన, గురవే = గురువునకు, నమః + అస్తు = నమస్కారము అగుగాక!

ఆయన ఫాలనేత్రం నుండి అగ్ని అన్నిదిశల్లో క్రమ్ముకొని ఆకాశాన్ని బెంబేలెత్తిస్తున్నది. ఆయన తేజస్సుతో వెలిగిపోతున్నాడు. గొప్ప తాండవ ప్రదర్శనకు ముందుగా వెలువడిన ఆయన విపులమైన వికటాట్టహాసం ఆయన మహత్త్వాన్ని చాటుతున్నది. స్వయంభువుడై మహితాత్ముడైన ఆ శివునకు నమస్కారము.





శ్లో॥ గురవే నమోఽస్తు గిరిజారసాక్తదృ-
క్పరిపీతదివ్యతనవే గజద్విషే ।
రటదంసకూటవినిబద్ధకర్పరా-
స్థిచయాభిరామమహసే ధుతాంహసే ॥ 13

గిరిజా... తనవే : గిరిజా = పార్వతీదేవియొక్క, రస = శృంగారరసముతో, ఆక్త = కూడిన, దృక్ = చూపులచే, పరిపీత = బాగుగా త్రాగబడిన, దివ్య = దివ్యమైన (కాంతివంతమైన), తనవే = శరీరం గలవాడు, గజద్విషే = గజాసురవైరి అయినవాడు, రట.. వపుషే : రటత్ = బలిష్ఠమైన, అంసకూట = వక్షఃస్థలమందు, వినిబద్ధ = అలంకరింపబడిన, కర్పర = కపాలమాల, అస్థిచయ = ఎముకల రాశితో, అభిరామ = మనోహరముగ, మహసే = తేజస్స్వరూపుడు, ధుత + అంహసే = పాపాల విదలించువాడు అయిన, గురవే = గురువునకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!

రసనిర్భరమైన కన్నులతో పార్వతి ఆయన దివ్యసౌందర్యాన్ని తనివిదీరా చూస్తున్నది. ఆయన గజాసురుని సంహరించిన యోధుడు. బలిష్ఠమైన భుజాంతరంలో ధరించిన కపాలమాలతో ఒప్పారుతున్నాడు. ఆయన పాపాలన్నింటినీ హరిస్తాడు. ఆ మహితాత్ముడైన శివునకు నమస్కారము.





**శ్లో॥ గురవే నమో౽స్తు పరతత్త్వరూపిణే**
**గురవే నమో౽స్తు భవరోగహారిణే ।**
**గురవే నమో౽స్తు భవజన్మతారిణే**
**గురవే నమో౽స్తు శివరూపధారిణే ॥** **14**

పరతత్త్వరూపిణే = పరబ్రహ్మరూపుడయిన, గురవే = గురువు (కొఱకు)నకు, నమః + అస్తు = నమస్కారము. భవరోగహారిణే = జన్మరోగమును హరించువాడగు, గురవే = గురువునకు, నమః + అస్తు = నమస్కారమగు గాక!, భవజన్మతారిణే = భవము యొక్క పుట్టుకను దాటించువాడగు, గురవే నమోస్తు , శివరూపధారిణే = మంగళరూపమును ధరించిన, గురవే = గురువునకు, శివునకు, నమః + అస్తు = వందనము.

పరతత్త్వమే ఆయన ఆకృతి. ఆయన సంసారవ్యాధిని హరిస్తాడు. అనేక జన్మరూపమైన సముద్రం నుండి గట్టెక్కిస్తాడు. మంగళరూపాన్ని ధరించి ప్రసన్నంగా ఉంటాడు. ఆ శివునికి నమస్కారము.





శ్లో॥ గిరిజానయనాబ్జలస-
చ్చిక్కణకజ్జలవినీలరుచినిచితమ్ ।
మాధుర్యాదపి మధురం
మదగంధిలమీక్షణం మహేశస్య ॥ **15**

గిరిజా... నిచితమ్ : గిరిజా = పార్వతియొక్క, నయనాబ్జ = నేత్రపద్మములందు, లసత్ = ప్రకాశించు, చిక్కణ = చిక్కనైన, కజ్జల = కాటుకవలన, వినీల = బాగా నల్లనైన, రుచి = కాంతితో, నిచితమ్ = వ్యాప్తమైనదియు, మాధుర్యాత్ + అపి = మధురగుణం కంటే కూడ, మధురమ్ = మధురమైనది, మదగంధిలమ్ = మదగంధముతో కూడినది అయిన, మహేశస్య = పరమేశ్వరునియొక్క, ఈక్షణమ్ = చూపు (దృష్టి) కలదు.

పార్వతీదేవిని తదేకదీక్షతో చూస్తూ ఉంటే ఆ దేవి కన్నుల కాటుకరంగు ఆయన చూపుకీ అంటుకున్నది. ఆయన చూపు మాధుర్యగుణం కంటే మధురంగా మదభరితమై ఉన్నది.





**శ్లో॥ రతిజాగరకుట్మలితం**
**కిఞ్చిదరుణమబ్జచన్ద్రికావలితమ్ ।**
**కరుణానిబిడితమవతా–**
**త్కాన్తితమం వీక్షణం గిరీశస్య ॥ 16**

రతి... కుట్మలితమ్ : రతిజాగర = రతికాలంలో మేల్కొనుటచే అలసి, కుట్మలితమ్ = అరమోడ్పుతో మొగ్గగాను, కిఞ్చిత్ + అరుణమ్ = కొంచెము ఎఱుపెక్కినది, అబ్జచంద్రికావలితమ్ = చంద్రుని వెన్నెలవలె చల్లగా నున్నది, కరుణానిబిడితమ్ = దయతో పూర్ణమైనదియు, కాంతితమమ్ = మిక్కిలి మెఱుపు గలిగినదియు అయిన, గిరీశస్య = గిరీశుని, వీక్షణమ్ = చూపు, అవతాత్ = రక్షించుగాక!

కాస్త అరుణమై, రతిజాగరంతో అలిసి అరమోడ్పై, వెన్నెలకు మూసికొన్న కలువలాగా మనోహరమై దయతో నిండారిన మహేశుని అందమైన చూడ్కి అందరినీ రక్షించుగాక!





శ్లో॥ **లలితాలలితాధరమణి-**
**పరిచుమ్బనసౌఖ్యముద్రితాన్నయనాత్ ।**
**జగతి పరం జానీమో**
**న పినాకినశ్చన్ద్రచన్ద్రికావలితాత్ ॥** **17**

లలితా = లలితాదేవియొక్క, లలిత = సుందరమైన, అధరమణి = మణివంటి క్రింది పెదవిని, పరిచుంబన = ముద్దిడిన, సౌఖ్య = ఆనందంతో, ముద్రితాత్ = కూడినది, చంద్రచంద్రికావలితాత్ : చంద్ర = చందురిని యొక్క, చంద్రికా = వెన్నెలతో, (ఆ)వలితాత్ = కూడిన, పినాకినః = పినాకపాణియొక్క, నయనాత్ = కంటికంటే, పరమ్ = మించినది, న జానీమః = తెలియదు (లేనేలేదు).

పార్వతీ మధురాధరాన్ని ముద్దాడిన సౌఖ్యంతో పరవశమై, వెన్నెల నిండిన మహేశుని నేత్ర సౌందర్యాన్ని మించింది మరొకటి జగత్తులో మాకు తెలియదు.





శ్లో॥ కపాలీ భిక్షాశీ పితృవననివాసీ పశుపతి-
ర్వినాశీ పాపానాం స్మితమధురవేషీ మృగధరః ।
పరానన్దస్తోత్రశ్రవణమృదుసఞ్చాలితశిరా
విదత్తామఙ్ఘ్రిం మే మనసి తపసా ధూతతమసి ॥ 18

కపాలీ = కపాలం ధరించినవాడు, భిక్షాశీ = అన్నపూర్ణాభిక్షాన్నము భుజియించువాడు, పితృవననివాసీ = శ్మశానంలో ఉండువాడు, పశుపతిః = పశువులను (జీవులను) పాలించువాడు, పాపానామ్ = పాపాలను, వినాశీ = వినాశం చేయువాడు, స్మితమధురవేషీ = చిఱునవ్వుగల మధురమైన వేషం ధరియించువాడు, మృగధరః = చేతిలో మృగాన్ని పట్టుకొన్నవాడు, పరానంద... శిరాః : పరానంద = ఇతరుల (అమ్మవారి) ఆనందకరమైన, స్తోత్ర = స్తుతులను, శ్రవణ = విని, మృదు = మృదువుగా, సంచాలిత = కంపింపచేసిన, శిరాః = శిరస్సుగలవాడు, అయిన, తపసా = తపస్సుతో, ధూతతమసి = చెదిరిపోయిన తమస్సుగల, మే = నాయొక్క మనసి = మనస్సులో, అంఘ్రిమ్ = పాదమును, విధత్తామ్ = ఉంచునుగాక!

కపాలాన్ని పట్టుకొని, భిక్షాటనం చేస్తూ, శ్మశానంలో నివసిస్తూ, పాపాలను హరిస్తూ, చిఱునవ్వుతో అందంగా కనిపిస్తూ మృగచర్మాన్ని ధరించి, ఆనందంగా భక్తులు స్తుతింపగా విని శిరఃకంపం చేస్తూ ఒప్పారే పశుపతి తపస్సుతో నిర్మలమైన నామనఃప్రదేశంలో కాలిడుగాక!





**శ్లో॥ దయాకుల్యా కల్యోన్మిషితసితపద్మానుగరుచిః**
**పురారాతి(శ్రీమాన్భుజగపతిభూషోజ్జ్వలతనుః ।**
**మహాకాలః కాలానలతులితనే(త్రోద్ధరశిఖో**
**విఛిన్ద్యాన్మే కామం బహులతరజన్మైకనిగడమ్ ॥ 19**

దయాకుల్యా = కృపా(ప్రవాహంతో, కల్యోన్మిషిత = (ప్రాతః కాలంలో విప్పారిన, సితపద్మానుగరుచిః = తెల్లటి పద్మమును అనుసరించు కాంతిగల, పురారాతిః = (త్రిపురశ(త్రువు, శ్రీమాన్ = శ్రీమంతుడు (విషము కంఠమున గలవాడు), భుజగపతి = సర్పరాజే, భూషా = అలంకారముగ, ఉజ్జ్వల = శృంగారభరితమైన, తనుః = శరీరం కల, కాలా... శిఖ: కాల = (ప్రళయకాల, అనల = అగ్నితో, తులిత = సమానమైన, నే(త్ర = కంటియందు, ఉద్ధరశిఖః = అగ్నికల, మహాకాలః = మహాకాళుడైన శివుడు, బహు... నిగడమ్ : బహులతర = అనేకానేక, జన్మ = పుట్టుకలకు, ఏకనిగడమ్ = బంధకమైన, మే = నా, కామమ్ = కామమును, విఛింద్యాత్ = ఛేదించునుగాక!

దయా(ప్రవాహంలో (ప్రాతఃకాలవేళ విప్పారిన పద్మంవలె (ప్రసన్నమైనవాడు, (త్రిపురాలను జయించినవాడు, సర్పభూషణాలతో మెరిసేవాడు, కాలాగ్నిని తలపించే కంటిమంట కలవాడు, మహాకాలుడు అనేక జన్మ సముపార్జితమైన నా కామాన్ని హరించుగాక!





శ్లో॥ పినాకీ నాకేశాదికవిబుధమస్తార్చితపదః
పదం తత్త్వౌఘానాం పరమపదసింహాసనగతః ।
సదార్తానాం దుఃఖోపశమనధురామగ్నహృదయో
దయాపుల్లః క్రోధం హరతు మమ సంవిత్ప్రశమనమ్ ॥ 20

నాకేశా... పదః : నాకేశ = స్వర్గాధిపతి ఇంద్రుడు, ఆదిక = మొదలైన, విబుధ = దేవతల, మస్త = తలలచే, అర్చితపదః = పూజింపబడిన పాదములు కలవాడు, తత్త్వౌఘానామ్ = బ్రహ్మతత్త్వసమూహాలకు, పదమ్ = స్థానమైనవాడును, పరమపద = గొప్పదైన, సింహానగతః = సింహాసనముపై ఉన్నవాడు, సదా = ఎల్లపుడు, ఆర్తానామ్ = ఆర్తులయొక్క, దుఃఖోపశమన = దుఃఖములను శమింపచేయు, ధురా = భారములో, మగ్న = మునిగిన, హృదయః = మనస్సు కలవాడు, దయాపుల్లః = దయతో విప్పారినవాడు, అయిన శివుడు, మమ = నాయొక్క, సంవిత్ = జ్ఞానమును, ప్రశమనమ్ = పోగొట్టు, క్రోధమ్ = కోపమును, హరతు = హరించుగాక!

పినాకాన్ని ధరించి, ఇంద్రాది దేవతలు ఆయన పాదాలకు ప్రణమిల్లగా, అన్ని తత్త్వాలకూ గమ్యమై, పరమపదసింహాసనంపై ఆసీనుడై, భక్తుల దుఃఖాన్ని శాంతింప జేయడానికి నిత్యం సన్నద్ధుడై విరాజిల్లే శివుడు, దయాప్రపూర్ణుడై, జ్ఞానాన్ని హరించే నా క్రోధాన్ని రూపుమాపుగాక!





**శ్లో॥ రాజరాజసఖశ్శమ్భూ**
**రాజరాజితమస్తకః ।**
**రాజీవసమనేత్రాంశో**
**మమ లోభాయితో హరః ॥ 21**

రాజరాజసఖః = కుబేరుని మిత్రుడు, రాజరాజితమస్తకః = చంద్రునిచే ప్రకాశించు శిరస్సు గలవాడు, రాజీవసమనేత్రాంశః = పద్మముతో సమానమైన నేత్ర కాంతిగలవాడు, శంభుః = శంభువు, అయిన, హరః = శివుడు, మమ = నాకు, లోభాయితః = లోభానికి గురియైనాడు.

కుబేరునికి మిత్రుడై, చంద్రవంకను శిరస్తటంపై ధరించి, విప్పారిన పద్మాలవంటి కనులతో వెలుగొందే శివుని మనసారా కాంక్షిస్తున్నాను.





శ్లో॥ నిటలానలనయనాపీత-
కామః కామవశంగతః ।
మమ వాఙ్మయమాధుర్యం
దారుకావనగోచరః ॥ 22

నిటలా... కామః : నిటల = లలాటమందున్న, అనలనయన = అగ్నినేత్రముచే, ఆపీత = త్రాగబడిన, కామః = కామంగలవాడు, కామవశంగతః = గౌరీకామమునకు వశుడయినవాడు, మమ = నాయొక్క, వాఙ్మయమాధుర్యమ్ = కవితామాధుర్యస్వరూపుడు, దారుకావనగోచరః = దారుక వనంలో దర్శనం ఇచ్చు శివుడు.

తన నుదుటికంటి మంటతో మన్మథుణ్ణి కబళించిన వాడు కామవశుడైనాడు. ఆయన నా కవితా మాధుర్యస్వరూపుడు, దారుకావనంలో దర్శనమిస్తాడు.





**శ్లో॥ ఏష చకాస్తి పురస్తాత్**
**దృశోర్ముహుర్ముహుర్వలితకణ్ఠః ।**
**నటనపరః పరమశివ-**
**శ్శివాయితార్ధాఙ్గనిచితశృఙ్గారః ॥ 23**

దృశోః = కన్నులకు, పురస్తాత్ = ముందుగా (ఎదురుగ), ముహుః + ముహుః = మాటి (మరలమరల) మాటికి, ఏషః = ఈ, వలితకంఠః = మాడిన కంఠము గలిగిన శివుడు, చకాస్తి = ప్రకాశించుచున్నాడు. ఏషః = వీడు, నటనపరః = నటనమందు ఆసక్తి కలవాడు, పరమశివః = గొప్ప శివుడు, శివాయిత.... శృంగారః : శివాయిత + అర్ధాంగ = పార్వతీదేవి సగభాగంగ చేయబడిన, నిచిత శృంగారః = శృంగారపురుషుడు.

నా కనుల ముందు శితికంఠుడై నటనపరుడైన పరమశివుడు మాటిమాటికి కన్పిస్తున్నాడు. ఆయన అర్ధశరీరం పార్వతిగా భాసిస్తూ శృంగారాన్ని స్పష్టం చేస్తున్నది.





శ్లో॥ నిహన్యాన్మాత్సర్యం త్రిపురదహనోద్రిక్తహృదయో
దయావీరశ్చణ్డీచరణనమనానన్దకమితా ।
య ఏవం ధ్యాయన్తో విమలమనసః కష్టతపసో
విదుర్వేద్యాన్తం తే న విదురపి శైవాగమవిదః ॥ 24

త్రిపుర... హృదయః : త్రిపుర = మూడుపురములను, దహన = దహించుటచే, ఉద్రిక్త = ఉద్రేకం చెందిన, హృదయః = గుండె కలవాడు, దయావీరః = దయచూపుటయందు ఉత్సాహం కలవాడు, చరణనమనానందకమితా = చండీ అమ్మవారి పాదములవద్ద మోకరిల్లువాడు అని, ఏవమ్ = ఈ విధంగ, విమలమనసః = విమల మనస్కులమయి, కష్టతపసః = దుశ్చరమైన తాపసులు, ధ్యాయంతః = ధ్యానం చేయువారు, వేద్యాంతమ్ = చివరగ తెలుసుకోదగిన శివుణ్ణి, విదుః = తెలుసుకొందురు, శైవాగమవిదః = శివాగమాలు (మంత్రం) తెలిసిన పండితులు, న విదుః = తెలుసుకొనలేరు.

త్రిపుర దహనంతో ఆయన హృదయం ఉద్రిక్తమైంది. ఆయన దయావీరుడు. చండీచరణముల ముందు ఆనందంతో మోకరిల్లుతాడు. ఎంతో కష్టమైన తపస్సును సమాచరించిన విశాల హృదయులు శివాగమవేత్తలు, శివుణ్ణి నిరంతరం ధ్యానిస్తూ తెలిసికొన్నారో లేదో!





శ్లో॥ కుమ్భజన్మముఖమౌనిమణ్డలీ-
మణ్డితే నవతమాలకన్ధరే ।
గన్ధవారణమదాపనోదనే
శామ్భవే మహసి లీయతే మనః ॥ 25

కుంభజన్మముఖ... మండితే : కుంభజన్మ = కుండలో పుట్టిన అగస్త్యుడు, ముఖ = మొదలైన, మౌని = మునుల, మండలీ = సముదాయంచే, మణ్డితే = భూషితము, నవతమాలకంధరే = చీకటిమ్రాను చిగురువంటి మెడగల (నీలకంఠుడు), గంధవారణ... పనోదనే : గంధవారణ = మదగజములయొక్క (గజాసురునియొక్క), మద = మదమును, అపనోదనే = పోగొట్టే, శాంభవే = శంభునికి సంబంధించిన, మహసి = తేజస్సునందు, మనః = మనస్సు, లీయతే = లీనమగుచున్నది.

అగస్త్యుడు మొదలైన మహామునులు ఆయన్ను పరివేష్టించి ఉంటారు. ఆయన మెడ తమాల పత్రంలాగా వినీలంగా ఉన్నది. ఆయన గజాసురుని మదాన్ని హరించిన మేటి. అట్టి శంభుని తేజస్సునందు నా మనస్సు లీనమౌతున్నది.





**శ్లో॥ విపులదృశం విసృతకచం**
**మధురాధరమన్దహాసమాధుర్యమ్ ।**
**గిరిజాలోచనకజ్జల–**
**రమణీయం జయతి శాఙ్కరం తేజః ॥ 26**

విపులదృశమ్ = పెద్ద కన్నులుగలది, విసృతకచమ్ = పెద్దగను శిరోజములు గలది, మధుర = మధురమైన, అధర = పెదవిపై, మందహాస = చిఱునవ్వుతో, మాధుర్యమ్ = మధురంగా నున్నది, గిరిజా... రమణీయమ్ : గిరిజా = పార్వతీదేవియొక్క లోచన = కన్నుల, కజ్జల = కాటుకతో, రమణీయమ్ = సుందరమైనది, శాంకరమ్ = శివుని, తేజః = తేజస్సు, జయతే = జయించుచున్నది.

విశాలమైన కన్నులతో అటునిటూ నడయాడే జటాసముదాయంతో అధరంపై మందహాసమాధుర్యంతో పార్వతి కనులకాటుకతో రమణీయమైన శంకరుని తేజస్సు జయిస్తుంది.





శ్లో॥ పార్వతీపదనిక్షిప్త-
లాక్షారసనిషేవితామ్ ।
నుమస్తామైన్దవీం రేఖాం
రతలీలారహస్సఖీమ్ ॥ 27

పార్వతీ... నిషేవితామ్ : పార్వతీ = పార్వతీదేవియొక్క, పద = పాదములయందు, నిక్షిప్త = ఉంచిన, లాక్షారస = లత్తుకను, నిషేవితామ్ = సేవించినదియు, రతలీలారహస్సఖీమ్ = ఏకాంతక్రీడలసఖురాలైన, తామ్ = ఆ ప్రసిద్ధమైన, ఐందవీమ్ = చంద్రుని, రేఖామ్ = రేఖను, నుమః = నమస్కరింతము.

శంకరుని శిరస్సుపై వెలుగొందే చంద్రరేఖకు పార్వతీ పదాల లత్తుక అంటుకున్నది. ఆదిదంపతుల రహః క్రీడాసఖియైన ఆ చంద్రరేఖను కీర్తించుదాం.





శ్లో॥ కమలకరం త్రిమలహరం
త్రిదశహరం మనసి శమితరుదితభరమ్ ।
మదనాన్తకమనుదివసం
ధ్యాయేమహి యోగిజీవనాధారమ్ ॥ 28

కమలకరమ్ = పద్మాలవంటి చేతులు కలవాడు, త్రిమలహరమ్ = మనోవాక్కాయ మలములను హరించువాడు, త్రిదశహరమ్ = బాల్య, యౌవన, వార్ధక్యములను దశలను హరించువాడు (మోక్షమోసంగువాడు), శమితరుదితభరమ్ = దుఃఖభారాన్ని శమింపచేయువాడు, మదనాంతకమ్ = కాముణ్ణి అంతమొందించినవాడు, యోగిజీవనాధారమ్ = యోగుల జీవనాధారమైన వాడయిన శివుని, అనుదివసమ్ = నిత్యమూ, మనసి = మనస్సున, ధ్యాయేమహి = ధ్యానించెదము.

సూర్యనేత్రుడై కమలాలను వికసింపచేసేవాడు, శరీరవాఙ్మనోమాలిన్యాన్ని హరించేవాడు, దేవతలను శాసించేవాడూ, మనస్సులో నున్న దుఃఖభారాన్ని శమింపచేసే వాడూ, మన్మథుణ్ణి హరించినవాడు, యోగి జీవనాధారమైనవాడు ఆ పరమశివుడు. ఆయనను నిత్యమూ ధ్యానించుదాం.





శ్లో॥ సంవిన్మయే విలీయే
చన్ద్రామృతమధురితాలికాపాఙ్గే ।
గౌరీప్రణయాసారే
కామాతిగమునిహృదబ్జకాసారే ॥ 29

సంవిత్+మయే = జ్ఞానమయమైనది, చంద్రా... పాంగే : చంద్రామృత = చంద్రుని అమృతంతో, మధురిత = తీయనైన, అలికా = అలకలతో కూడిన, అపాంగే = క్రీగంటిచూపులు కల, గౌరీప్రణయాసారే = పార్వతీదేవి ప్రణయ వర్షంతో (నిండిన), కామాతిగ = కామునిగెల్చిన, ముని = మునుల, హృదబ్జ = హృదయపద్మ, కాసారే =సరస్సులో, విలీయే = లీనమగుదును.

ఆయన జ్ఞానమయుడు, ఆయన నిటలాక్షదృక్కులు చంద్రామృతంతో మధురంగా సిద్ధమైనాయి. ఆయన గౌరీకాంతను ప్రణయవర్షంతో ప్రసన్నం చేస్తాడు. కామాన్ని జయించిన మునులు, ఆయన హృదయసరస్సులో కమలములలాగా ఉంటారు. ఆ శివునియందు నేను లీనమౌతాను.





శ్లో॥ లక్ష్మీం తనోతు శశిభూషణపాదయుగ్మం
పౌరన్దరీవిమలరల్లకమల్లికాఢ్యమ్ ।
ఆరక్తనేత్రశఫరీమృదుగానవాహి-
న్యాప్లావితం నిగమవాదసుగన్ధిలం నః ॥ 30

పౌరందరీ... కాఢ్యమ్ : పౌరందరీ = దేవతాస్త్రీల, విమల = స్వచ్ఛమైన, రల్లక = పాపిటలోని, మల్లికాఢ్యమ్ = మల్లెపూలతో కూడినది, ఆరక్తనేత్ర... ప్లావితమ్ : ఆరక్తనేత్ర = కొంచెము ఎఱుపెక్కిన కన్నులు గల, శఫరీ = చేపలు చేయు, మృదు = సుకుమారమైన, గాన = గానంగల, వాహినీ = నదిచే, ఆప్లావితమ్ = తడుపబడినది, నిగమవాద = వేదవాదములచే, సుగంధిలమ్ = పరిమళభరితమైనది అయిన, శశిభూషణపాదయుగ్మమ్ = చంద్రశేఖరుని పాదయుగం, నః = మనకు, లక్ష్మీమ్ = ఐశ్వర్యాన్ని, తనోతు = విస్తరింపచేయుగాక.

దేవతాస్త్రీల విమలవస్త్రములు మల్లికాపుష్పములవలె ఆచ్ఛాదింపగా, కాస్త ఎఱుపెక్కిన కనులతో శబరకాంతలు మధురంగా గానం చేస్తూ, ఆ గానప్రవాహంతో ప్రోక్షాళింపగా వెలుగొందు చంద్రశేఖరుని పాదయుగ్మం సంపదను అనుగ్రహించుగాక!





శ్లో॥ యశ్శాస్త్రయోనిరపి భక్తిపథైకగమ్యో
రాత్రిఞ్చరోఽపి జనుషాం తమసాం నిహన్తా ।
భిక్షాచరోఽపి భృశదానపరాయణోఽసౌ
భూయాదనన్తమహిమా జగతాం సుఖాయ ॥ 31

శాస్త్రయోనిః = వేదైకవేద్యుడు, అపి = అయినప్పటికి, భక్తిపథైకగమ్యః = భక్తిమాత్రమునకే తెలియబడువాడు, రాత్రించరః + అపి = రాత్రులందు తిరుగువాడయినా, జనుషామ్ = జన్మల, తమసామ్ = చీకట్లను, నిహంతా = పోగొట్టువాడు, భిక్షాచరః + అపి = భిక్షాటనచేయువాడయినా, భృశ = అధికంగా, దాన = దానం చేయుటలో, పరాయణః = గొప్పవాడు అయిన, అనంతమహిమా = అంతులేని మహిమలు గలిగిన, అసౌ = ఈ శివుడు, జగతామ్ = జగముల, సుఖాయ = సుఖముల కొరకు, భూయాత్ = అగుగాక!

సకలశాస్త్రాలకు ఉత్పత్తి స్థానీయుడైనా ఆయనను భక్తిమార్గాన్ని అనుసరించే చేరగలము. వల్లకాటిలో రాత్రులందు చరించేవాడైనా ఆయన అనేకజన్మల తమస్సును హరిస్తాడు. భిక్షాటనం చేసేవాడైనా, ఆయన మహాదాత. అనంతమహిమాన్వితుడైన ఆ మహాదేవుడు జగత్తులకు సుఖమును కలిగించుగాక!





**శ్లో॥ గోప్త్రీ దేవవ్రజానాం వినమితమనసాం సమ్ప్రదాత్రీ సుఖానాం**
**హర్త్రీ దుఃఖాదిహేతోశ్శివ ఇతి వచసా గీయమానా మహద్భిః ।**
**సమ్భిన్నేభేన్ద్రదన్తద్యుతిముషి వపుషి స్థీయమానా త్రిణేత్రా**
**ద్వన్ద్వజ్ఞానాత్పరస్తాద్విచరతి మహితా శామ్భవీ బ్రహ్మవిద్యా ॥ 32**

దేవవ్రజానామ్ = దేవతలసముదాయానికి, గోప్త్రీ = రక్షించునది, వినమితమనసామ్ = భక్తులకు, సుఖానామ్ = సుఖాలను, సంప్రదాత్రీ = ఇచ్చునది, దుఃఖాదిహేతోః = దుఃఖాదుల కారణాన్ని, హన్త్రీ హరించునది, మహద్భిః = గొప్పవారిచే, శివ ఇతి వచసా = శివ అనే నామంతో, గీయమానా = గానం చేయబడునది, సంభిన్న... ముషి : సంభిన్న = పగిలిన, ఇభేన్ద్ర = ఏనుగు (యొక్క), దంత = దంతముయొక్క, ద్యుతి = కాంతిని, ముషి = దొంగిలించు, వపుషి = శరీరమందు, స్థీయమానా = ఉండునది, త్రిణేత్రా = మూడుకన్నులు గలిగినది అయిన, శాంభవీ = శంభునకు సంబంధించిన, బ్రహ్మవిద్యా = బ్రహ్మవిద్య, ద్వంద్వజ్ఞానాత్ = శీతోష్ణాది ద్వంద్వములకు, పరస్తాత్ = అతీతమై, మహితా = గొప్పగ, విచరతి = రాజిల్లుతున్నది.

దేవతలనందరినీ కాపాడేదీ, భక్తులకు సుఖాలను కలిగించేదీ, దుఃఖాదులకు కారణభూతమైన వానినన్నింటినీ హరించేదీ, మహాత్ములచే శివనామంతో కీర్తింప బడేదీ, పగిలిన ఏనుగుదంతంవలె తెల్లనైన శరీరకాంతి కలిగినదీ, మూడు కన్నులతో విరాజిల్లేదీ సుఖదుఃఖాలకు అతీతమైనదీ ఐన శాంభవ బ్రహ్మవిద్య లోకంలో గొప్పగా రాణిస్తుంది.





**శ్లో॥ పార్వతీస్తనతారుణ్య-**
**పరీపాకఫలం స్తుమః ।**
**వక్షోదేశం మహేశస్య**
**గజాసురకిణాఙ్కితమ్ ॥ 33**

గజాసురకిణాంకితమ్ = గజాసురునిచే మచ్చగా చేయబడిన, మహేశస్య = మహేశుని, వక్షోదేశమ్ = వక్షఃస్థలము, పార్వతీ... ఫలమ్ : పార్వతీ = పార్వతీదేవియొక్క, స్తన = కుచముల, తారుణ్య = యౌవనంయొక్క, పరీపాక ఫలమ్ = పరిపాక ఫలముగా, స్తుమః = స్తుతించెదను.

గజాసురమర్దనంలో మహేశుని వక్షస్థలం కాయలు గాచింది. ఆ విశాల వక్షస్థలం పార్వతీస్తనపటుతా పారమ్యానికి లభించిన ఫలం వలెనున్నది. దానిని కీర్తించుదాము.





శ్లో॥ మదభరకుచైకపార్శ్వం
మదనమదాటోపవర్ధిమధురముఖమ్ ।
ధనదసఖం కలితసుఖం
విలోకయే మనసి విభ్రమాధారమ్ ॥ 34

మదభరకుచైకపార్శ్వమ్ = మదభరితమైన స్తనముగల ఒక (భాగం) వైపు, మదన... ముఖమ్ : మదన = మన్మథుని, మద = మదముయొక్క, ఆటోప = గర్వాన్ని, వర్ధి = పెంచు, మధుర = సుందరమైన, ముఖమ్ = మొగము గల, ధనదసఖమ్ = కుబేరునిమిత్రము, కలితసుఖమ్ = సుఖాన్ని కలిగించునది, విభ్రమాధారమ్ = శృంగారభావాలకు ఆశ్రయమైనది, అయిన శివరూపమును, మనసి = మనస్సులో, విలోకయే = చూచుచుందును.

అర్ధభాగం స్త్రీరూపమై, మన్మథమదాన్ని ప్రేరేపించే అందమైన ముఖంతో ప్రకాశిస్తూ, మనస్సుకి విభ్రమం కలిగించే, సుఖకరమైన కుబేరమిత్రమైన రూపాన్ని చూస్తున్నాను.





శ్లో॥ మనోనిర్వాణమస్మాక-
మేకమేవావభాసతే ।
కైలాసపర్వతాగారే
నటలీలాపరం మహః ॥ 35

కైలాసపర్వతాగారే = కైలాసగిరి గృహంలో, నటలీలాపరమ్ = తాండవలీలాపరమైన, మహః = తేజస్సు, అస్మాకమ్ = మాయొక్క, మనోనిర్వాణమ్ = మనస్సుకు ఆనందంగ, ఏకమ్+ఏవ = ఒక్కటే, అవభాసతే = స్పష్టముగ భాసించుచున్నది.

మా మనస్సులకు ఆనందం కలిగించే కాంతి ఒక్కటే – అది కైలాసపర్వతగుహలో నాట్యంలో లీనమై ఉన్నది.





**శ్లో॥ ఆధారామ్బుజవిహరణశీలో**
**బాధాకరభవవిదలనకీలః ।**
**బోధాద్భుతసరసీరుహమాలీ**
**కృపణహృదం మామవతు త్రిశూలీ ॥ 36**

ఆధారాంబుజవిహరణశీలః = ఆధార కమలంలో విహరించే స్వభావం కలవాడు, బాధా... కీలః: బాధ = కష్టాలకు, ఆకర = స్థానమైన, భవ = సంసారమును, విదలనశీలః = భేదించు శీలముగలవాడు, బోధా... మాలీ : బోధ = జ్ఞానమను, అద్భుతసరసీరుహ = ఆశ్చర్యకరమైన పద్మాల, మాలీ = మాలను ధరించినవాడు, అయిన, త్రిశూలీ = త్రిశూలధరుడు (శివుడు), కృపణహృదమ్ = దీనహృదయముగల, మామ్ = నన్ను, అవతు = కాపాడుగాక!

ఆ త్రిశూలి ఆధారకమలంలో విహరిస్తూ, బాధాకరమైన సంసారాన్ని దహిస్తూ, అద్భుత జ్ఞానపుష్పమాలను ధరిస్తూ పిరికిగుండె వాణ్ణైన నన్ను కాపాడుగాక!





శ్లో॥ మునిమానసగగనాన్తరహంసో
జ్ఞానామృతసరసీకలహంసః ।
గిరితనయానలినీసితభృఙ్గ-
శ్చిరమధివసతు దృశోర్మధురాఙ్గః ॥ 37

మునిమానస = మునులమనస్సనే, గగనాంతర = ఆకాశసీమలో విహరించు, హంసః = హంస, జ్ఞానామృతసరసీకలహంసః = జ్ఞానమనే అమృత సరస్సులో సంచరించు, గొప్పహంస, గిరితనయా... భృంగః : గిరితనయా = పార్వతీదేవి అను, నలినీ = పద్మమునందు వ్రాలిన, సితభృంగః = తెల్లనితుమ్మెద అయిన, మధురాంగః = మధురమైన శరీరంగల శివుడు, దృశోః = నా కన్నులందు, చిరమ్ = చిరకాలము, అధివసతు = నిలుచుగాక!

ఆయన మునిమానసాకాశంలో విహరించే హంస, జ్ఞానామృతసరస్సులో ఈదులాడే హంస. పార్వతీరూపకమలాన్ని ఆశ్రయించిన తెల్లని తుమ్మెద. అంతటి మనోహరరూపం కలిగిన శివుడు నా కనులముందు చిరకాలం నిలుచుగాత!





శ్లో॥ మదనాభివర్ధనతనూ
మదమధురౌ కమలబన్ధురకరౌ చ ।
పుష్కరకచౌ భజేయం
పితరౌ లోకైకరక్షణాకారౌ ॥ 38

మదనాభివర్ధనతనూ = మన్మథుణ్ణిపెంచే శరీరసౌందర్యం కలవారూ, మదమధురౌ = మదముచే మధురమైనవారూ, కమలబంధురకరౌ = పద్మాలవంటి చేతులు కలవారు, పుష్కరకచౌ = పుష్కరం (ఆకాశం, మేఘము) వంటి శిరోజములు కలవారు, పితరౌ = లోకానికి తల్లిదండ్రులు, లోకరక్షణ + ఆకారౌ = లోకరక్షణకై ఆకృతి దాల్చిన పార్వతీపరమేశ్వరులను, (కమలం = జలము, పద్మమము), భజేయమ్ = భజింతును.

వారి శరీరసౌందర్యం మన్మథుని ప్రోత్సహిస్తున్నది. వారు మదంతో అందంగా కన్పిస్తున్నారు. చేతులలో కమల పుష్పాలను ధరించినారు. ఒకరి జటాజూటం పుష్కరమేఘం వలె విస్తరింపగా మరొకరి కేశసంపద పుష్కళంగా ఉన్నది. లోకరక్షణకై అవతరించిన ఆకారములతో విరాజిల్లే జగత్పితరులను (పార్వతీపరమేశ్వరులను) భజిస్తాను.





శ్లో॥ గిరిజాప్రణయాదర్శవిలోచన-
సరభసవిగలత్కరుణాపూరః ।
మస్తకధృతనీరో మృదుహీరో-
పమహసితోఽవతు గుణకూపారః ॥ 39

గిరిజా... పూరః : గిరిజా = పార్వతీదేవియొక్క, ప్రణయాదర్శ = ప్రేమభరితమైన, విలోచన = చూపులచే కలిగిన, సరభస = హర్షముతో, విగలత్ = జాలువారిన, కరుణాపూరః = కరుణారసంగలవాడు, మస్తకధృతనీరః = తలయందు ధరించిన నీరుకలవాడు, మృదు...హసితః : మృదు = మృదువైన, హీరోపమ = ముత్యం పోలిన, హసితః = చిఱునవ్వుకలవాడు, గుణకూపారః = గుణసముద్రుడయిన, శివుడు, అవతు = రక్షించుగాక!

పార్వతీదేవి ప్రణయాలోకంతో హృదయంలో కరుణారసం పొంగెత్తగా శిరస్సుపై గంగను ధరించి, మృదువైన హీరంవలె నిర్మలమైన మందహాసంతో వెలుగొందే సద్గుణసముద్రుడైన శివుడు రక్షించుగాక!





**శ్లో॥ ధిమిధిమితకమర్దలమర్దననిన-**
**దానుగకోమలవిచలితపాదః ।**
**ప్రతిపదచలనప్రకల్పితవేదః**
**ప్రతిపదమవతాన్మునిగణబోధః ॥ 40**

ధిమి... పాదః : ధిమిధిమితక = ధిమిధిమితక అను, మర్దల = మద్దెలయొక్క, నినద+అనుగ = నినాదముననుసరించి, కోమల = కోమలంగ, విచలిత = కదిలిన, పాదః = పాదములు గలవాడు, ప్రతిపద... వేదః : ప్రతిపదచలన = ప్రతిఅడుగుల కదలికలతో, ప్రకల్పితవేదః = వేదములను ఆవిర్భవింపచేసినవాడు, మునిగణబోధః = మునుల సముదాయమునకు జ్ఞానమిచ్చిన శివుడు, ప్రతిపదమ్ = అనుక్షణము, అవతాత్ = రక్షించుగాక

మద్దెల ధిమి ధిమితక ధ్వనుల కనుగుణంగా కోమలంగా పాదాలను కదిలిస్తూ నృత్యం చేస్తూ, పదఘట్టనంతో వేదాలను సృజిస్తూ, మునులకు జ్ఞానోదయం కలిగించే శివుడు ప్రతిపదం తోడై రక్షించుగాక!





**శ్లో॥ ఉల్లోకితనయనోద్గతదృష్టిస-**
**ముల్లసితామ్బరకల్పితమేఘః ।**
**కహకహనినదాకబలితలోకః**
**కాన్తోఽవతు గిరిశో దలితాఘః ॥ 41**

ఉల్లోకిత... మేఘః : ఉల్లోకిత = పైకి చూచు, నయన = కన్నులనుండి, ఉద్గత = వెలువడిన, దృష్టి = చూపులతో, సముల్లసిత = విరాజిల్లిన, అంబర = ఆకాశంలో, కల్పిత = ఏర్పర్చబడిన, మేఘః = మబ్బులు కలవాడు, (ప్రళయమేఘకర్త శివుడు), కహకహ... లోకః : కహ కహ = కహ, కహ అను, నినద = ధ్వనులతో, ఆకబలితలోకః = పూర్తిగమ్రింగినలోకాలు కలవాడు, దలితాఘః = పాపాలను భేదించినవాడు, కాంతః = కాంతుడయిన, గిరిశః = శివుడు, అవతు = రక్షించుగాక!

పైకెత్తిన కనుల చూపులతో ఆకాశంలో మేఘాలను కల్పించి, కహకహమనే అట్టహాస ధ్వనితో లోకాలను కబళించి, పాపాలను పారద్రోలి ప్రకాశించే శివుడు రక్షించుగాక!





**శ్లో॥ మస్తకచాలితమన్దానురణ-**
**ద్గఙ్గాకణముక్తాఞ్చితఫాలః ।**
**నిటలాఫలకానృత్యదభఙ్గా-**
**గ్నిశిఖాకృతనీరాజనమాలః ॥ 42**

మస్తక... ఫాలః : మస్తక చాలిత = శిరఃకంపముతో కదిలన, మందానురణద్ = మెల్లగా ప్రవహించే, గంగాకణ = గంగానదినీటికణములనే, ముక్తాంచిత = ముత్యాలతో అలంకరింపబడిన, ఫాలః = నుదురు కలవాడు, నిటలాఫలకా = నుదుట భాగాన, ఆనృత్యద్ = బాగా నర్తించుచున్న, అభంగా = అఖండమైన, అగ్నిశిఖాకృత = అగ్నిజ్వాలలచే చేయబడిన, నీరాజనమాలః = నీరాజనమాలలు కలవాడయిన శివుడు (అవతు = రక్షించుగాక!)

శిరఃకంపంతో కదిలి, మందధ్వనితో ప్రవహించే గంగానది జలబిందువులు ముత్యాలవలె ఆయన ఫాలతలంలో కన్పిస్తున్నాయి. నిటలఫలకంపై అగ్నిశిఖలే నీరాజనమాలలుగా ఉన్నాయి. (ఆయన రక్షించుగాక!)





శ్లో॥ ధీరవారిధరమన్ద్రగర్జిత-
స్ఫారగీతనిబిరీసదిక్తటః ।
నాట్యవేగబహుధాపదత్పదః
పాతు మాం రభససఞ్చలత్పటః ॥ 43

ధీర... దిక్తటః : ధీర = గంభీరమైన, వారిధర = మేఘముల, మంద్ర = ఆనందం కలిగించు, గర్జిత = గర్జనం వలన, స్ఫారగీత = ప్రచురమైన గానంతో, నిబిరీస = నిండిన, దిక్తటః = దిగ్భాగములు గల, నాట్య... పదః : నాట్య = నాట్యముయొక్క, వేగ = వేగముచే, బహుధా = అనేకవిధములుగ, పదత్పదః = చలించు పదములుగల, రభస... పటః : రభస = వేగంతో, సంచలత్ = సంచలించుట, పటః = వస్త్రముగల, శివుడు, మామ్ = నన్ను పాతు = రక్షించుగాక!

నిర్భరమేఘగర్జనంతో దిక్కులు పిక్కటిల్లినాయి. నాట్యంలో వేగంగా కదిలే పదాలు నినదిస్తున్నాయి. ఆ వేగానికి ఆయన ధరించిన గజచర్మపటం సంచలిస్తున్నది. (ఆయన రక్షించుగాక!)





శ్లో॥ సన్ధ్యామ్బుదనిభగన్ధేభాజిన-
విగలితరక్తపరిష్కృతగాత్రః ।
మామవతాద్గిరిజాస్తనచూచుక-
మృగమదలహరీసురభితనేత్రః ॥ 44

సంధ్యా.... గాత్రః : సంధ్యా = సంధ్యాకాలపు, అంబుద = మేఘము (తో), నిభ = వలె (సమానమైన) నున్న, గంధేభ = మదించిన, గజాసురుని, అజిన = చర్మమునుండి, విగళిత = కారిన, రక్త = రక్తముతో, పరిష్కృతగాత్రః = భూషితశరీరుడు, గిరిజా... నేత్రః : గిరిజా = పార్వతీదేవియొక్క, స్తనచూచుక = చనుమొనలకంటిన, మృగమదలహరీ = కస్తూరికాప్రవాహముచే, సురభిత = పరిమళంతో నిండిన, నేత్ర ః = నేత్రాలుకల శివుడు, మామ్ = నన్ను, అవతాత్ = రక్షించుగాక!

సంధ్యాకాలమేఘాన్ని తలపించే గజాన్ని సంహరించి నెత్తురోడుతున్న ఆ చర్మాన్ని అందంగా ధరించినాడు. పార్వతీస్తనకస్తూరికాపరిమళంతో ఆయన కన్నులు వెలుగుతున్నాయి. ఆయన నన్ను రక్షించుగాక!





**శ్లో॥ చిన్తితఫలసమ్పాదన-**
**చిన్తామణిరమరనికరమస్తమణిః ।**
**తాత్త్వికతేజస్సరణిః**
**పునాతు మాం కాలకణ్ఠహీరమణిః ॥ 45**

చింతిత... మణిః : చింతిత = తలచిన, ఫల = కోరికలను, సంపాదన = సంపాదించు, చింతామణిః = చింతామణి (అయినవాడు), అమరనికర = దేవతాసమూహాల, మస్తమణిః = శిరోమణి, తాత్త్వికతేజస్సరణిః = బ్రహ్మతేజోమార్గము, కాలకంఠహీరమణిః = నీలకంఠుడనే ముత్యమయిన శివుడు, మామ్ = నన్ను, పునాతు = పవిత్రునిచేయుగాక!

కోరికలను ఈడేర్చే చింతామణి, దేవతా సమూహానికి మణివంటివాడు. తాత్త్విక తేజస్సును ప్రసరింపజేసేవాడు. ఆ కాలకంఠుడనే హీరమణి నన్ను పవిత్రుని చేయుగాక!





**శ్లో॥ పునన్తు శామాఙ్గీవిమలతమదన్తోపమకలాః**
**కలాధామప్రోద్యత్కిరణనికరాసారతులితాః ।**
**వలత్కల్పక్రోడప్రథితసితదన్తవ్యతికరా–**
**స్త్రిణేత్రస్యోద్ధాసాస్సకలజగదాస్ఫోటనపరాః ॥ 46**

శ్యామాంగీ... కలాః : శ్యామాంగీ = పార్వతీదేవియొక్క, విమలతమ = మిక్కిలి స్వచ్ఛమైన, దంత = దంతములతో, ఉపమకలాః = పోల్చదగినవి, కలాధామ... తులితాః : కలాధామ = చంద్రుని, ప్రోద్యత్కిరణ = పెల్లుబుకు కిరణముల, నికర = గుంపువలె, ఆసారతులితాః = నీటితుంపరలవలె (చల్లనైనవి) నున్నవి, వలత్... వ్యతికరాః : వలత్కల్పకోడ = ఆదివరాహం యొక్క, ప్రథిత = ప్రసిద్ధమైన, సిత = తెల్లనైన, దంత = కోరలకు, వ్యతికరాః = సంబంధించిన తెలుపు గలవి, సకలజగదాస్ఫోటనపరాః = సకల జగత్తులను భేదింపగలిగినవీ, అయిన, త్రినేత్రస్య = ముక్కంటియొక్క, ఉత్ + హాసాః = అట్టహాసములు, పునంతు = పవిత్రము చేయుగాక!

పార్వతీదేవి దంతకాంతివలె తెల్లనైనవీ, చంద్రుని కిరణములతో పోల్చదగినవీ, ఆదివరాహదంష్ట్రా సమానమైన ధావళ్యము కలిగినవీ, సకల జగత్తులను భేదింప గలిగినవీ ఐన త్రినేత్రుని అట్టహాసాలు పావనము చేయగాక!





**శ్లో॥ కిమేతదవ్యయం వస్తు**
**శివనామ్నా ప్రదీపితమ్? ।**
**కవిమార్గజుషాం నృణా-**
**మతులం మధువాఙ్మయమ్ ॥** **47**

శివనామ్నా = శివుడను పేరుతో, ప్రదీపితమ్ = వెలుగొందిన, అవ్యయమ్ = శాశ్వతమైన, కిమ్, ఏతద్, వస్తు = ఏదో అనిర్వచనీయమైన వాస్తవమైనది, కవిమార్గజుషామ్ = కవుల పద్ధతిననుసరించే, నృణామ్ = నరులకు, అతులమ్ = సాటిలేని, మధు = తీయనైన (మధురమగు), వాఙ్మయమ్ = వేదవాక్కులతో విలసిల్లునది.

శివనామంతో వెలుగొందే శాశ్వతమైన ఆ వస్తువేదో తెలియరాదు. కవులందరికీ అది నిరుపమానమైన, తేనెవలె తీయనైన వాఙ్మయము.





శ్లో॥ కల్యాణవిత్తనిధయే కనకాచలేన్ద్ర-
కోదణ్డకాణ్డపరిఖణ్డితరాక్షసాయ ।
పఞ్చాక్షరీపరమపావనమన్త్రవర్ణ-
రూపాయ ధిక్కృతయమాయ నమో నమోఽస్తు ॥ 48

కల్యాణవిత్తనిధయే = మంగళ సంపదకు గని అయినవాడు, కనకా... రాక్షసాయ : కనకాచలేంద్ర = మేరుపర్వతమనే, కోదండకాండ = కోదండ, బాణంతో, పరిఖండిత = ఖండింపబడిన, రాక్షసాయ = రాక్షసులు కలవాడు, పంచాక్షరీ-పరమపావన = మిక్కిలి పవిత్రమైన, మంత్ర-వర్ణరూపాయ = మంత్రవర్ణరూపుడు, ధిక్కృతయమాయ = యముణ్ణి ధిక్కరించినవాడు, అయిన శివుని కొఱకు, నమః నమః = మాటిమాటికి నమస్కారము, అస్తు = అగుగాక!

శుభకరమైన సంపదలకు ఆయన ఒక నిధి. మేరుపర్వతాన్ని ధనుస్సుగా ధరించి రాక్షసులను సంహరించినవాడు. పరమపవిత్రమైన పంచాక్షరీమంత్రరూపుడు. యముణ్ణి ధిక్కరించినవాడు. ఆయనకు నమస్సులు.





**శ్లో॥ శేషశైలశిఖరాధివాసినః**
**కిఙ్కరాః పరమవైష్ణవా వయమ్ ।**
**తత్తథాపి శశిఖణ్డశేఖరే**
**శాఙ్కరే మహసి లీయతే మనః ॥ 49**

వయమ్ = మేము, శేషశైలశిఖరాధివాసినః = శేషాచలశిఖరాలలో వసించు శ్రీనివాసునకు, కింకరాః = దాసులము, తత్ = అది, తథా + అపి = అలాయినప్పటికిని, మనః = మామనస్సు, శశిఖండశేఖరే = చంద్రశేఖరమైన, శాంకరే = శంకరసంబంధమైన, మహసి = తేజస్సునందు, లీయతే = లీనమగుచున్నది.

మేము శేషాద్రిపై కొలువైన శ్రీనివాసుని దాసులము. పరమవైష్ణవులము. ఐననూ, చంద్రరేఖను శిరోభూషణంగా ధరించిన శంకరాకృతి కాంతియందే మనస్సు లీనమౌతున్నది.





**శ్లో॥ నమో నారాయణాయేతి**
**మన్త్రోఽస్మాకం హృది ప్రియః ।**
**తథాపి నేత్రయోరగ్రే**
**వరీవర్తి మహానటః ॥ 50**

నమో నారాయణాయ = నమో నారాయణాయ (నారాయణునకు నమస్కారము అను అర్థం కల), ఇతి మంత్రః = అను మంత్రము, అస్మాకమ్ = మాయొక్క, హృది = మనస్సులో, ప్రియః = ఇష్టమైనది, తథా అపి = అయినప్పటికి, నేత్రయోః = కన్నుల, అగ్రే = ముందు, మహానటః = మహాకాలనటుడు (శివుడు), వరీవర్తి = నిలిచియున్నాడు.

'నమో నారాయణాయ' అను మంత్రమే మా హృదయమునకు ప్రియమైనది. ఐననూ, మా కన్నుల ముందు మహానటుడు వెలిగిపోతున్నాడు.





శ్లో॥ శూలస్య భర్తా శమనస్య హర్తా
ధర్తా శ్రుతీనాం ప్రలయే విహర్తా ।
సత్యానృతే యో వివినక్తి లోకే
స్యతు భ్రమం నః పరమః పరాత్మా ॥ 51

శూలస్య = శూలమునకు, భర్తా = ప్రభువు, శమనస్య = యముణ్ణి, హర్తా = హరించువాడు, శ్రుతీనామ్ = వేదాలను, ధర్తా = ధరించువాడు, ప్రలయే = ప్రళయకాలంలో, విహర్తా = విహరించువాడు, లోకే = లోకంలో, యః = ఎవడు, సత్యానృతే = సత్యాసత్యాలను, వివినక్తి = విభజించువాడో, సః = ఆ, పరమః = గొప్పవాడయిన, పరాత్మా = పరమాత్మ, నః = మనయొక్క, భ్రమమ్ = భ్రమను, స్యతు = ఖండించుగాక!

ఆయన శూలమును భరించినవాడు. యముని హరించినవాడు. వేదములను ధరించినవాడు. ప్రళయకాలంలో విహరించేవాడు. లోకంలో సత్యాన్నీ అనృతాన్నీ (అసత్యాన్ని) విడదీసి వివరించేవాడు. ఆ పరాత్పరుడు నా భ్రాంతిని తొలగించుగాక!





శ్లో॥ త్వమగ్నిస్త్వం వాయుస్త్వమసి జగదాధారవిశద-
స్త్వమేవాధ్యః సామ్నాం త్వమసి యజమానః క్రతువిధౌ ।
స్మరన్తస్త్వామేవ స్తిమితమతయో దివ్యమునయో
న కాంక్షన్తే మోక్షం పశుప! కృపయా పాలయ పశుమ్ ॥ 52

పశుప! = జీవులను పాలించు శివ!, త్వమ్ = నీవు, అగ్నిః = అగ్నివి, త్వమ్ = నీవు, వాయుః = గాలివి, త్వమ్ = నీవు, జగదాధారవిశదః = జగత్తునకాధారమైన సత్త్వగుణానివి, త్వమ్ + ఏవ = నీవే, సామ్నామ్ = సామములకు, ఆధ్యః = పుష్టివి, క్రతువిధౌ = యజ్ఞవిధిలో, త్వమ్ = నీవు, యజమానః = యజమానుడవు, అసి = అయితివి, స్తిమితమతయః = నిశ్చయబుద్ధిగల, దివ్యమునయః = దివ్యమునులు, త్వామ్ + ఏవ = నిన్నే, స్మరన్తః = తలచుచు, మోక్షమ్ = మోక్షాన్ని, న – కాంక్షంతే = కాంక్షింపరు, కృపయా = దయతో, పశుమ్ = పశువునయిన నన్ను, పాలయ = పాలించుము.

నీవు అగ్నివి. నీవు వాయువు. నీవు విశాలమైన ఆకాశానివి. నీవు సామవేదశోభితుడవు. నీవు యజ్ఞమును నిర్వహించే యజమానుడవు. నిన్ను స్మరిస్తూ ప్రశాంతమనస్కులైన దివ్య మునులు మోక్షాన్ని కూడా కాంక్షింపరు. పశుపతీ! నేను పశువును. నన్ను దయతో పాలించు.





**శ్లో॥ న యత్ర సూర్యో న విధుర్న వహ్ని-**
**ర్న భిన్నతా న త్రిగుణావభాసః ।**
**చరన్తమానన్దమయే మహిమ్ని**
**మృడం భజామో మృగితం మునీన్ద్రైః ॥ 53**

యత్ర = ఎచ్చట, న సూర్యః = సూర్యుడుండడో, న విధుః = చంద్రుడుండడో, న వహ్నిః = అగ్ని ఉండదో, న భిన్నతా = భేదభావముండదో, న త్రిగుణావభాసః = సత్త్వరజస్తమోగుణాల ప్రకాశముండదో – అట్టి, ఆనందమయే = ఆనందమయమైన, మహిమ్ని = తన మహిమలో, చరంతమ్ = సంచరించు, మునీంద్రైః = మునీంద్రులచే, మృగితమ్ = వెదకబడు, మృడమ్ = శివుణ్ణి, భజామః = భజింతము.

సూర్యుడుకాని, చంద్రుడుకాని, అగ్నికాని ప్రవేశింపని భిన్నత్వములేని, త్రిగుణములు లేని ఆనందమయమైన మహిమోపేతమైన స్థానమునందు వెలుగొందునట్టి, మునీంద్రులు అన్వేషించునట్టి మృడుణ్ణి (శివుని) భజించుదాము.





శ్లో॥ ఓఙ్కారరత్నమకుటా-
లఙ్కారశ్శత్రుభయదహుఙ్కారః ।
వేదాలీఝుఙ్కారో
దదాతు మే దర్శనం చిదాకారః ॥ 54

ఓంకార... టాలంకారః : ఓంకార = ఓంకారము (ప్రణవము) అను, రత్నమకుటాలంకారః = రత్నకిరీటమలంకారంంగా గల, శత్రుభయదహుంకారః = శత్రువులకు భయమునిచ్చు హుంకారంగల, వేదాలీ = వేదములనే తుమ్మెదల, ఝుంకారః = ఝుంకారము అయిన, చిదాకారః = జ్ఞానస్వరూపము, మే = నాకు, దర్శనమ్ = దర్శనమును, దదాతు = ఇచ్చుగాక!

ఓంకారం ఆయన రత్నకిరీటానికి అలంకారం. ఆయన హుంకారం శత్రుభయంకరం. వేదాలు ఆయన ఝుంకారం. ఆయనది చిదాకారం. ఆయన నాకు దర్శనమును అనుగ్రహించుగాక!





**శ్లో॥ సన్తనోతు మయి సన్తతం శివః**
**సౌఖశాయనికవాసవాదికః ।**
**స్వస్తి నిస్తులమనన్యశాలినీ**
**యేన చౌపనిషదీ సరస్వతీ ॥ 55**

సౌఖశాయనిక-వాసవాదికః = ఇంద్రాదులచే సుఖనిద్రను అడుగబడువాడు అయిన, శివః = శివుడు, మయి = నాయందు, సంతతమ్ = ఎల్లపుడు, స్వస్తి = శుభాన్ని, సంతనోతు = విస్తరించుగాక!, యేన = ఎవ్వనిచేత, నిస్తులమ్ = సాటిలేని, అనన్యశాలినీ = ఇతరత్ర సాధ్యముకాని, ఔపనిషదీ సరస్వతీ = ఉపనిషత్ప్రతిపాద్యమైన మహావాక్యం ఏర్పడినదో (అట్టి శివుడు)

ఆయనకు ఇంద్రాది దేవతలు ప్రాతఃకాలశుభాభివాదం చేస్తారు. ఆయన క్షేమంకరుడు. ఆయనవలననే ఉపనిషత్సరస్వతి ప్రకాశిస్తున్నది.





శ్లో॥ శ్రీనిధిం ధృతదిగమ్బరం మహా-
కాలముచ్ఛ్రితజటాపినాకినమ్ ।
సర్వభూతసుహృదం సనాతనం
శాన్తిగన్ధిలముఖం సమాశ్రయే ॥ 56

శ్రీనిధిమ్ = సంపదలకు గని, ధృతదిగంబరమ్ = దిక్కులను వస్త్రముగ ధరించినవాడు, మహాకాలమ్ = మహాకాలుడు, ఉచ్ఛ్రిత = గొప్పవైన, జటా = జడలను, పినాకినమ్ = పినాకమను ధనస్సును కలవాడు, సర్వభూత సుహృదమ్ = ప్రతి ప్రాణికి హితము చేయువాడు, సనాతనమ్ = ఆదిలేనివాడు, శాంతిగంధిలముఖమ్ = శాంతమైన ముఖం కలవాడు, అయిన శివుణ్ణి, సమాశ్రయే = ఆశ్రయించెదము.

ఆయన సంపదలకు నిధి. ఆకాశాన్ని అంబరంగా ధరించినవాడు. మహాకాలుడు. ఉన్నతమైన జటాజూటంతో, పినాకంతో వెలుగొందేవాడు. సర్వభూతాలకూ ఆప్తుడు. సనాతనుడు. పరమశాంతమైన ఆయన ముఖారవిందాన్ని సమాశ్రయిస్తాను.





శ్లో॥ దుర్జయేన్ద్రియపథాతిగామినః
కుమ్భజన్మముఖపుణ్యయోనయః ।
యత్పదద్వయముపేత్య తారితా-
స్తుఙ్గమఙ్గలముమాధిపం భజే ॥ 57

దుర్జయే.... గామినః : దుర్జయ = జయింపరాని ఇంద్రియ, పథ = చక్షురాది ఇంద్రియ మార్గాలను, అతిగామినః = మీరినవారును, కుంభజన్మముఖపుణ్యయోనయః = అగస్త్యుడు మొదలైన పుణ్యజన్ములు, అవ్యయమ్ = నాశములేని, యత్పదద్వయమ్ = శివుని పాదద్వయమును, ఉపేత్య = చేరి, తారితాః = తరించిరి. (అట్టి) తుంగమంగలమ్ = పరమ శుభాస్పదుడు, ఉమాధిపమ్ = ఉమాదేవి పతియైన శివుణ్ణి, భజే = భజించుచున్నాను.

ఇంద్రియజయం సాధించిన అగస్త్యాది మహామునులు ఆయన పదములను ఆరాధించి తరించినారు. పరమశుభాస్పదుడైన ఆ మహాప్రభువును భజిస్తాను.





శ్లో॥ అద్భుతం మహదపేతసాధ్వసం
కిఞ్చిదస్తి కిల వస్తు నిస్తులమ్ ।
ఇత్యబోధి నిగమైర్ముహుర్ముహు-
ర్యచ్చిదాత్మకముపాశ్రయామహే ॥ **58**

అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనది, మహత్ = గొప్పదైనది, అపేతసాధ్వసమ్ = నిర్భయమైనది. నిస్తులమ్ = సాటిలేనిది అయిన, కించిత్ = అనిర్వచనీయమైన, వస్తు = వస్తువు (వాస్తవమైనది) అస్తి = ఉంది, కిల = కదా, ఇతి = అని, నిగమైః = వేదాలచే, ముహుః + ముహుః = మరల మరల, అబోధి = తెలియబడెను, యత్ + చిదాత్మకమ్ = అట్టి చిత్ స్వరూపాన్ని, సముపాశ్రయామహే = ఆశ్రయించెదము.

అద్భుతమై, మహితమై, ఉత్సాహభరితమై ఒప్పారు నిస్తులమైన వస్తువేదియో వివరింపరాకున్నది. ఈ సత్యమును వేదములు గ్రహించినవి. అటువంటి చిదాత్మకమైన కాంతిని ఆశ్రయించుదము.





శ్లో॥ విష్ణురేవ జగతాం పరం మహో
నాస్తి కశ్చిదపి సంశయో మమ ।
వైష్ణవాగ్రమపదం వినిన్దతాం
శఙ్కరం శ్రుతిశతేషు కా గతిః ॥ 59

విష్ణుః + ఏవ = విష్ణువే, జగతామ్ = లోకాలకంటే, పరమ్ = గొప్పదైన, మహః = తేజస్సు. మమ = నాకు, కశ్చిత్ + అపి = ఏమాత్రం, సంశయః = సంశయము, నాస్తి = లేదు. వైష్ణవాగ్రమపదమ్ = విష్ణుభక్తులలో శ్రేష్ఠపదవిలోనున్న, శంకరమ్ = శంకరుణ్ణి, వినిందతామ్ = నిందించే, వారికి, శ్రుతి శతేషు = వేదశతాలలో, గతిః కా = స్థానమెక్కడిది – ఉండదు, (వేదబాహ్యులని తాత్పర్యము).

విష్ణువే జగత్తులన్నింటినీ మించిన తేజస్సు అనుటలో నాకు ఎట్టి సందేహమూ లేదు. వైష్ణవాగ్రణులలో శ్రేష్ఠుడైన శంకరుని నిందించినవారికి వేదములందు స్థానమెక్కడిది?





శ్లో॥ శఙ్కరే భువనశఙ్కరేఽపి వా
శ్రీపతౌ శ్రుతిశతాధివాసిని ।
భిన్నదృష్టిమపహాయ యోగిన-
స్సన్తరన్తి తమసాం పదం జనిమ్ ॥ 60

భువనశంకరే = లోకాలకు శుభాలను కలిగించు, శంకరే = శివునియందు, శ్రుతిశతాధివాసిని = అనేక వేదరాశులలో ప్రతిపాద్యుడయిన, శ్రీపతౌ = లక్ష్మీపతియైన విష్ణువునందు, అపి – వా = కాని, భిన్నదృష్టిమ్ = భేదదృష్టిని, అపహాయ = విడిచిపెట్టి, యోగినః = యోగులు, తమసాం పదమ్ = అజ్ఞాన చీకట్లకు నెలవైన, జనిమ్ = పుట్టుకను, సంతరంతి = తరించుదురు, (లేకుండ చేసుకొందురు.)

భువనములకన్నింటికి శుభము కలిగించు శంకరుని యందు, వేదములందు కీర్తింపబడిన విష్ణువు నందు భేదభావమును మాని యోగులు తరిస్తారు. (చీకటినిండిన పుట్టువునుండి విముక్తులౌతారు).





శ్లో॥ అయత్నసఙ్కల్పితసర్వలోక-
మకృత్రిమాణాం వచసాం విభావ్యమ్ ।
అగోచరం బ్రహ్మముఖామరాణా-
మానన్దకన్దం శరణం వ్రజామి ॥ 61

అయత్నసంకల్పితసర్వలోకమ్ = ఏ ప్రయత్నమూ లేకయే లోకాలన్నింటినీ సృష్టించినవాడు, అకృత్రిమాణామ్ = నిత్యములైన, వచసామ్ = వాక్కులైన వేదాలకు, విభావ్యమ్ = గోచరించువాడు, బ్రహ్మముఖ + అమరాణామ్ = బ్రహ్మ మొదలైన దేవతలకు, అగోచరమ్ = తెలియబడనివాడు, ఆనందకందమ్ = ఆనందానికి మూలమైన వాడు అయిన శివుణ్ణి, శరణమ్ = రక్షణను, వ్రజామి = పొందుదును.

ఆయన లోకాలన్నింటినీ అప్రయత్నంగా సృష్టిస్తాడు. వేదాలు ఆయన్ను వర్ణిస్తాయి. బ్రహ్మాది దేవతలకు ఆయన అగోచరుడు. ఆనందస్థానమైన శివుణ్ణి శరణు వేడుతాను.





**శ్లో॥ విపశ్చితామప్యనధీతమార్గ-**
**మపశ్చిమం నిర్మలభక్తిభాజామ్ ।**
**కారుణ్యపూరైస్తు వికాసయన్తం**
**విద్యాదికాన్ విశ్వగురుం నమామి ॥ 62**

విపశ్చితామ్ + అపి = విద్యావంతులకు కూడ, అనధీతమార్గమ్ = అభ్యసింపని పద్ధతి గలవాడు (తెలియబడనివాడు), నిర్మలభక్తిభాజామ్ = అవ్యాజమైన (ఫలాభి సంధి లేని) భక్తులకు, అపశ్చిమమ్ = గోచరించువాడు, కారుణ్యపూరైః = దయారసప్రవాహాలచే, విద్యాదికాన్ = విద్యలన్నింటిని, వికాసయన్తమ్ = ప్రకాశింప చేయుచున్న, విశ్వగురుమ్ = జగద్గురువైన శివుణ్ణి, నమామి = నమస్కరింతును.

పండితులు ఆయనను తెలుసుకోజాలరు. నిర్మలమైన భక్తికలవారికే ఆయన సులభుడు. ఆయన తన కరుణాపూరంతో విద్యలనన్నింటినీ వికసింపజేస్తాడు. విశ్వగురువైన అట్టి శివునకు నమస్కారము.





శ్లో॥ సౌన్దర్యపుమ్భావమహీన్ద్రహారం
కల్పాగసీధుద్రవరక్తనేత్రమ్ ।
విలోకతాం దైవతపుఙ్గవానాం
మనాంసి సద్యస్తరుణీబభూవుః ॥ 63

సౌందర్యపుంభావమ్ = పురుషాకృతిని ధరించిన సౌందర్యమనునట్లున్నవాడు, అహీంద్రహారమ్ = నాగేంద్రహారుడు, కల్పాగసీధుద్రవ = కల్పవృక్షాల ఆసవాన్ని గ్రోలుటచే, రక్తనేత్రమ్ = ఎఱుపెక్కిన కన్నులు కలవాడు అయిన వానిని, విలోకయతామ్ = చూచు, దైవతపుంగవానామ్ = దేవతాపురుష శ్రేష్ఠుల, మనాంసి = మనస్సులు, సద్యః = వెంటనే, తరుణీబభూవుః = తరుణభావాన్ని పొందినవి.

సౌందర్యం పురుషాకృతిని ధరించినట్లు ఆయన ప్రకాశిస్తున్నాడు. మహాసర్పాలను హారాలుగా ధరించినాడు. కల్పవృక్షంనుండి లభించే ఆసవాన్ని గ్రోలి ఆయన కన్నులు కాస్త ఎఱ్ఱబడినాయి. ఆయనను విలోకించిన దేవతల మనస్సులు తరుణభావాన్ని పొందినాయి.





**శ్లో॥ పరస్పరసమాశ్లేష-**
**రసోన్మత్తపరస్పరమ్ ।**
**కిమప్యవిదితం ధామ**
**చకాస్తి మమ నేత్రయోః ॥ 64**

పరస్పర.... పరస్పరమ్ : పరస్పర = ఒకరినొకరు, సమాశ్లేష = ఆలింగనంచే కలిగిన, రసోన్మత్త = శృంగార రసంతో మత్తెక్కిన, పరస్పరమ్ = అన్యోన్యులయిన శివపార్వతులు, కిమ్ + అపి + అవిదితమ్ = ఇతరమేమీ భాసింపని, ధామ = కాంతి, మమ = నా (యొక్క), నేత్రయోః = కన్నులకు, చకాస్తి = ప్రకాశించుచున్నది.

పరస్పరాలింగనంతో రసోన్మత్తమై వర్ణింపరాని కాంతి యేదో నా కన్నుల ముందు ప్రకాశిస్తున్నది.





**శ్లో॥ పీతం యక్షసుతాభిరాయతతరైర్నేత్రైరభీక్ష్ణాఙ్గజం**
**సద్యోభిన్నహిమాద్రికాననతటీకస్తూరికాగన్ధిలమ్ ।**
**వీణాగానరసాభితర్పితమనాఙ్నిద్రాయమాణామ్బకం**
**నాగేన్ద్రాభరణం నతార్తిహరణం సౌన్దర్యమీడేమహి॥ 65**

యక్షసుతాభిః = యక్షకన్యల, ఆయతతరైః = మిక్కిలి విశాలమైన, నేత్రైః = కన్నులచే, అభీక్ష్ణాంగజమ్ = చూడబడిన, శరీరమైనది, సద్యః = అపుడే, అభిన్న = నిండిన, హిమాద్రికాననతటీ = హిమగిరి అడవుల, కస్తూరికాగంధిలమ్ = కస్తూరికా పరిమళం కలది, వీణాగాన... అంబకమ్ : వీణాగాన = వీణాగానముయొక్క, రసాభితర్పితమనాక్ = రసాస్వాదనంచే తృప్తిపడిన, నిద్రాయమాణాంబకమ్ = నిద్రావస్థలో ఉన్న, కన్నులు గలది (అరమోడ్పుకన్నులు గలది), నాగేంద్రాభరణమ్ = వాసుకి అలంకారంగ గలది, నతార్తిహరణమ్ = నమస్కరించిన వారి బాధలను హరించునది అయిన, సౌందర్యమ్ = ఆనందాన్ని సౌందర్యాన్ని, ఈడేమహి = స్తుతించుచున్నాము.

యక్షకాంతలు తమ విశాలమైన నేత్రాలతో ఆ సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నారు. అది హిమాచలారణ్యంలో విశేషంగా ప్రసరించిన కస్తూరీ పరిమళంతో నిండారింది. సర్ప-భూషణాలతో ఇనుమడిస్తున్నది. భక్తుల బాధలను తీరుస్తున్నది. ఆ సౌందర్యాన్ని స్తుతిస్తున్నాను. (శివునికి ఆయన సౌందర్యానికి అభేదం చెప్పడం)





శ్లో॥ స్వామిన్! సృష్ట్యాదిమారభ్య
మత్సమో నాస్తి పాతకీ ।
యది మద్రక్షణే న స్యా
ఆహోస్విత్కిమ్భవిష్యతి ॥ 66

స్వామిన్! = ఓ ప్రభూ!, సృష్ట్యాదిమ్ + ఆరభ్య = సృష్టి మొదలునుండి, మత్సమః = నాతో సమానమైన, పాతకీ = పాపములు కలవాడు, నాస్తి = లేడు, మత్ + రక్షణే = నా రక్షణ యందు, యది న స్యాః = లేకపోయినచో, ఆహోస్విత్ = అయ్యో!, కిం భవిష్యతి = ఏమి గతి గలుగును.

సృష్టి ఆరంభమైన నాటినుండి నావంటి పాతకి లేడు. నీవే రక్షింపకున్నచో, ఇక నాకేమౌతుంది? (మరొక గతి లేదని అర్థము)





శ్లో॥ అఙ్గేషు విభ్రమదృశామతిలోలకామాత్
నిర్లజ్జమేవ పశువద్బహుశః ప్రవృత్తమ్ ।
సంస్మృత్య తాని హృదయం పరిదూయతే మే
స్వామిన్! దయాశరనిధే! కరుణాం విధేహి ॥ **67**

విభ్రమదృశామ్ = విలాసచూపులుగల యువతుల, అంగేషు = అవయవాలయందు, అతిలోలకామాత్ = మిక్కిలి చపలమైన కామం వలన, నిర్లజ్జమ్ + ఏవ = సిగ్గులేకయే, బహుశః = పలుమార్లు, పశువత్ = పశువువలె, ప్రవృత్తమ్ = ప్రవర్తించితిని, తాని = ఆ ప్రవర్తనలను, సంస్మృత్య = తలచి, మే = నా, హృదయమ్ = మనస్సు, పరిదూయతే = బాధపడుచున్నది. స్వామిన్! = ప్రభూ!, దయాశరనిధే! = దయాసముద్రా!, కరుణామ్ = దయను, విధేహి = ఉంచుము.

విభ్రమం కలిగించే కాంతల శారీరక సౌందర్యానికి వశుణ్ణై కామాతిరేకంతో పశువు వలె ప్రవర్తించినాను. ఆ విషయాన్ని తలుచుకుంటే హృదయం బాధపడిపోతుంది. దయాసముద్రుడవైన శంకరా! నన్ను దయజూడుము.





శ్లో॥ సమ్భుక్తమేవ సుఖముజ్ఝితతృప్తిచిత్తం
రోమన్థయిష్యతి పునః పునరిన్దుచూడ! ।
ఇత్థంగుణా భగవతీ భవదీయమాయా
జన్తూన్ నిహన్తి కుసుమాకృతిఖడ్గికేవ ॥ **68**

ఇందుచూడ! = చంద్రశేఖర!, సుఖమ్ = సుఖాన్ని, సంభుక్తమ్ + ఏవ = బాగుగ అనుభవించినదే ఐనను, ఉజ్ఝితతృప్తి = తృప్తిలేనిదియైన, చిత్తమ్ = మనస్సు, పునః = మరల, రోమంథయిష్యతి = నెమరువేయును (మరల మరల కోరును), ఇత్థంగుణా = ఇట్టి గుణం గల, భగవతీ = పూజ్యురాలైన, భవదీయ మాయా = నీ మాయను, కుసుమాకృతిఖడ్గికా + ఇవ = పూవు యొక్క ఆకారంలో ఉండే కత్తి వలె, జంతూన్ = జీవులను, నిహన్తి = సంహరించును.

తృప్తి కలిగేలాగా సుఖాలను అనుభవించినా, మనస్సు వాటినే నెమరు వేస్తుంటుంది. నీ మాయాస్వభావమది. అది పుష్పాకారంలో ఉన్న ఖడ్గంలాగా జంతువులను సంహరిస్తుంది.





శ్లో॥ పూర్వకర్మపరిపాకమూలకం
భవ్యమస్తు శుచయే సుఖాయ వా ।
శైవవైష్ణవపథాతివర్తినీ
స్యాచ్ఛివే మహసి భక్తివాహినీ ॥ 69

పూర్వకర్మపరిపాకమూలకమ్ = పూర్వజన్మకర్మ ఫలానుసారంగ, శుచయే = శుచి కొరకు, సుఖాయ వా = సుఖానికో, భవ్యమ్ = క్షేమం, అస్తు = అగుగాక, శైవవైష్ణవపథాతివర్తినీ = శైవవైష్ణవమార్గాలను అతిక్రమించిన, భక్తివాహినీ = భక్తిప్రవాహము, శివే మహసి = శివతేజస్సునందు, స్యాత్ = ఉండుగాక!

పూర్వకర్మఫలానుసారంగా జరుగవలసింది మంచియో చెడో జరుగనీ, శైవవైష్ణవ భేదానికి అతీతమైన భక్తిప్రవాహము శివకాంతియందు నెలకొనుగాక!





శ్లో॥ ఐన్దీవరీ దృశి పదే వికచారవిన్దీ
చన్ద్రాతపీ శిరసి కణ్ఠతటే చ నీలీ ।
నిత్యం శివాత్మకతయా ప్రవిభావ్యమానా
కాన్తిః కరోతు కృపయా దురితోపశాన్తిమ్ ॥ **70**

దృశి = చూపులో, ఐందీవరీ = కలువలకాంతి, పదే = పాదమందు, వికచారవిందీ = వికసించిన పద్మాలకాంతి, శిరసి = తలపై, చంద్రాతపీ = వెన్నెలకాంతి, కంఠతటే = కంఠ ప్రదేశంలో, నీలీ = నీలకాంతి అయిన, శివాత్మకతయా = శివమయంగా, ప్రవిభావ్యమానా = విశేషంగా తలచే, కాంతిః = వెలుగు, కృపయా = దయతో, దురిత + ఉపశాంతిమ్ = పాపములకు శాంతిని, కరోతు = చేయుగాక!

కనులు కలువపూవులవలె, పదములు వికసించిన కమల పుష్పాలవలె, శిరస్సున వెన్నెలతో, కంఠంపై నీలకాంతితో ఒప్పారి, శివాత్మకముగా భావింపబడే కాంతి దయతో పాపములను శాంతింపజేయుగాక!





శ్లో॥ విలీనం స్వానన్దే గతచలనచిత్రాయితతనుం
తుషారాద్రేర్వాతైశ్చలితచికురం కాన్తినిచితమ్ ।
విశాలోరస్కం త్వాం సుభగతరపద్మాసనయుతం
కదా సమ్పశ్యేయం ప్రమదజలనిష్యన్దినయనమ్ ॥ 71

స్వానందే = ఆత్మానందంలో, విలీనమ్ = మునిగి, గతచలనచిత్రాయితతనుమ్ = చలనముడిగి బొమ్మగామారిన శరీరం కలవాడు, తుషారాద్రేః = మంచుకొండయొక్క వాతైః = గాలులకు, చలితచికురమ్ = కదలిన శిరోజములు కలవాడు, కాంతినిచితమ్ = కాంతితో కూడిన, విశాల + ఉరస్కమ్ = విశాలమైన వక్షఃస్థలం కలవాడు, సుభగతరపద్మాసనయుతమ్ = అందంగ పద్మాసనగతుడు అయిన, త్వామ్ = (శివా!) నిన్ను, ప్రమదజలనిష్యన్దినయనమ్ = ఆనందాశ్రువులు జాలువారే కన్నులతో, కదా = ఎపుడు, సంపశ్యేయమ్ = చూడగలనొ?

ఆత్మానందంలో లీనమై కదలికలేని చిత్తరువువలె కన్పిస్తున్నవానిని, హిమాచల మందపవనానికి కేశపాశం కాస్త కదులుతున్నవానిని, కాంతితో మెరుస్తూ విశాల వక్షఃస్థలంతో పద్మాసనస్థుడై మనోహరంగా కన్పిస్తున్న వానిని ఆనందాశ్రువులు జలజలరాలే కన్నులతో ఎప్పుడు చూస్తాను?





శ్లో॥ కైలాసాచలమణ్డనం గిరిసుతాకామానురాగాఙ్కురం
భోగత్యాగనిధిం నదత్సురనదీగానైకలక్ష్యాయితమ్ ।
కిఞ్చిద్ధాససుధాతరఙ్గితముఖం మన్దారమాలాయిత-
ప్రేమోదారకటాక్షమాదిమగిరాం మాధుర్యమీడేమహి ॥ 72

కైలాసాచలమండనమ్ = కైలాసగిరికి అలంకారము, గిరిసుతాకామానురాగాంకురమ్ = పార్వతీ ప్రేమానురాగాలకు మూలము, భోగత్యాగనిధిమ్ = భోగానికి, త్యాగానికి గని, నదత్సురనదీగానైక-లక్ష్యాయితమ్ = గలగలపారు గంగానదీ గానమునకు లక్ష్యమైనది, కిఞ్చిత్ + హాససుధాతరంగితముఖమ్ = మందహాసమను అమృతప్రవాహానికారంభము, మందారమాలాయిత ప్రేమోదారకటాక్షమ్ = మందార పుష్పమాలగా మారిన ప్రేమభరితచూపుగల, ఆదిమగిరామ్ = తొలి పలుకు, (వేదము యొక్క), మాధుర్యమ్ = తీయదనాన్ని, ఈడేమహి = స్తుతించెదను.

కైలాసపర్వతానికి ఆయన ఒక అలంకారం. పార్వతీ ప్రేమభావానికి మూలం. భోగానికీ త్యాగానికీ నిధి. గంభీరనాదంతో ప్రవహించే గంగానది ఆయనను గూర్చియే గానం చేస్తున్నది. మందహాసామృతంతో ఆయన ముఖం వెలిగిపోతున్నది. ఆయన కటాక్షవీక్షణాలు ప్రేమభరితాలై, మందారమాలలను తలపిస్తున్నాయి. ఆయన వేదవాక్కుల మాధుర్యం. ఆయనను స్తుతించుదము.





**శ్లో॥ అస్తి వస్తు సురసున్దరీకన-**
**త్కైశ్యమాల్యకలికావిచుమ్బితమ్ ।**
**యైస్తు భావితమిదం వినిర్జితం**
**తైస్సహస్రజననార్జితం తమః ॥ 73**

సుర... చుమ్బితమ్ : సుర సుందరీ = దేవతాస్త్రీల, కనత్ + కైశ్య = ప్రకాశించు కేశభారంలోనున్న, మాల్య = పూలమాలల, కలికా = మొగ్గలతో, విచుంబితమ్ = తాకియున్న, వస్తు = వాస్తవమైనది, అస్తి = కలదు, యైః + తు = ఎవరిచేతనైతే, ఇదమ్ = ఈ వస్తువు, భావితమ్ = భావించబడునో, తైః = వారిచే, సహస్రజననార్జితమ్ = వేల పుట్టువులలో ప్రోగుచేయబడిన, తమః = తమస్సు, వినిర్జితమ్ = పూర్తిగ గెలవబడును.

దేవతాస్త్రీ కేశభారంలో వెలుగొందే పుష్పకోరకాలు చుంబిస్తున్న వస్తువొకటి ఉన్నది. ఆ వస్తువును భావించి పొందినవారికి జన్మసహస్రాలలో సంచితమైన తమస్సు వీడిపోతుంది.





శ్లో॥ రామనామజపకర్మతే శివే
కేశవే శివజపానువర్తిని ।
నారదాదిమునయస్తపోధనా-
శ్శైవవైష్ణవభిదాం వితత్యజుః ॥ 74

రామనామజపకర్మతే = రామనామజపతత్పరుడైన, శివునందు, శివజపానువర్తిని = శివజపమును చేయు, కేశవే = విష్ణువునందును, తపోధనాః = తపస్సే ధనంగా గల, నారదాది మునయః = నారదుడు మొదలైన మునులు, శివవైష్ణవభిదామ్ = శివకేశవభేదమును, వితత్యజుః = పూర్తిగ విడిచిరి.

శివుడు, రామనామ జపపరాయణుడు. కేశవుడు శివజపం చేస్తాడు. ఇది తెలిసిన తపోధనులైన నారదాదిమునులు శైవవైష్ణవ భేదాన్ని పరిత్యజించినారు.





శ్లో॥ నాగేన్ద్వోత్తంసచూడం నటదలకభరం నవ్యరాజీవనేత్రం
పీనస్కన్ధోరుబాహుం ప్రణవపరిచితం బిల్వమాలాభిరామమ్ ।
వ్యామగ్రాహ్యస్తనీభిశ్శబరయువతిభిర్వీక్ష్యమాణం సరాగం
కైవల్యానన్దవేశ్మ ప్రవిశతు హృదయే కిఞ్చిదద్వైతసీమా ॥ 75

నాగ+ఇందు+ఉత్తంస చూడమ్ = వాసుకిని, చంద్రుణ్ణి, కర్ణపూరశేఖరముగలవాడు, నటదలకభరమ్ = నర్తించు అలకలు కలవాడు, నవ్యరాజీవనేత్రమ్ = అపుడే వికసించిన పద్మమువంటి నేత్రాలు కలవాడు, పీనస్కంధోరుబాహుమ్ = బలిసిన మూపు, తొడలు, బాహువులు కలవాడు, ప్రణవపరిచితమ్ = ఓంకారంతో తెలియబడువాడు, బిల్వమాలాభిరామమ్ = మారేడుదళాలమాలతో అందమైనవాడు, వ్యామగ్రాహ్యస్తనీభిః = పెద్దచనులు గలిగిన, సరాగమ్ = ప్రేమతో, శబరయువతిభిః = యువతులచే, వీక్ష్యమాణమ్ = చూడబడువాడు, కైవల్యానందవేశ్మ = మోక్షానందమునకు నెలవు, కించిత్ + అద్వైతసీమా = అనిర్వచనీయమైన అద్వైతమునకు అవధి, హృదయే = నా మనస్సులో, ప్రవిశతు = ప్రవేశించుగాక!

మహాసర్పాలను జటాభూషణంగా ధరించి, కేశపాశాలు కదలగా, అప్పుడే వికసించిన పద్మాలలాగా కనులు వెలుగగా, సమున్నత బాహుస్కంధాలతో బిల్వమాలికలను ధరించి, పీనస్తనశోభితలైన శబరయువతులు ప్రేమావలోకనం చేయగా కైవల్యానందానికి స్థానభూతంగా, అద్వైతపరసీమగా ఒప్పారే వెలుగు నా హృదయంలో ప్రవేశించుగాక!





శ్లో॥ **విమలలోచనం విషయమోచనం**
**విచలితాలకం విశ్వపాలకమ్ ।**
**భూతిశోభితం భూతసేవితం**
**చిదచిదాత్మకం శివముపాస్మహే ॥** **76**

విమలలోచనమ్ = నిర్మలమైన కన్నులు గలవాడు, విషయమోచనమ్ = విషయాలను విడిచినవాడు, విచలితాలకమ్ = బాగా చలించు ముంగురులు కలవాడు, విశ్వపాలకమ్ = ప్రపంచాన్ని పాలించువాడు, భూతసేవితమ్ = ప్రాణులచే సేవించబడువాడు, భూతిశోభితమ్ = విభూతితో శోభిల్లువాడు, చిత్ + అచిత్ + ఆత్మకమ్ = చిత్తు, జడముల స్వరూపుడు, అయిన, శివమ్ = శివుణ్ణి, ఉపాస్మహే = ఉపాసించుదును.

విమలమైన భావములతో బేసికన్నులతో కదలాడే జటాకలాపంతో భూతసేవితుడై చిదచిదాత్మకుడైన సంపన్మహితమూర్తియైన శివుని ఉపాసిస్తున్నాము.





**శ్లో॥ పరమవైష్ణవం పార్వతీధవం**
**పరశుధారిణం బన్ధహారిణమ్ ।**
**మదవిఖణ్డనం త్రిదశమణ్డనం**
**పరపురఞ్జయం ప్రభుముపాస్మహే ॥ 77**

పరమవైష్ణవమ్ = గొప్ప విష్ణుభక్తుడు, పార్వతీధవమ్ = గిరిజానాథుడు, పరశుధారిణమ్ = గొడ్డలి ధరించువాడు, బంధహారిణమ్ = బంధాలను పోగొట్టువాడు, మదవిఖండనమ్ = మదమును ఖండించువాడు, త్రిదశమండనమ్ = దేవతలకు అలంకారకందమైనవాడు, పరపురంజయమ్ = శత్రుపట్టణాలను జయించినవాడు, అయిన, ప్రభుమ్ = ప్రభువును, ఉపాస్మహే = ఉపాసించుచున్నాను.

పరమవైష్ణవుడు, పార్వతీపతి, పరశుధారి, సమస్తబంధములను మరించువాడు, సకల గర్వాపహారి, దేవసమూహాలంకారుడు, శత్రువులపురములను జయించిన వాడు. ప్రభువు. ఆయనను ఉపాసిస్తున్నాము.





శ్లో॥ ప్రమథనాయకం నయనసాయకం
దివ్యగాయకం దీప్తిదాయకమ్ ।
శమవిధాయకం సౌఖ్యనేయకం
మదనమర్దినం మృడముపాస్మహే ॥ 78

ప్రమథనాయకమ్ = ప్రమథగణాలకు నేత, నయనసాయకమ్ = కన్నులే బాణంగ కలవాడు, దివ్యగాయకమ్ = దివ్యగానం చేయువాడు, దీప్తిదాయకమ్ = తేజస్సును వెలుగును ఇచ్చువాడు, శమవిధాయకమ్ = శాంతిని కలిగించువాడు, సౌఖ్యనేయకమ్ = సౌఖ్యమునిచ్చువాడు, మదనమర్దినమ్ = కాముణ్ణి కాల్చినవాడు, అయిన, మృడమ్ = సుఖాన్నిచ్చు శివుణ్ణి, ఉపాస్మహే = ఉపాసించుదుము.

ఆయన ప్రమథులకు నాయకుడు. ఆయన చూపులు బాణాల్లాగా ఉన్నాయి. దివ్యగానాన్ని ఆలపిస్తున్నాడు. దీప్తిని కలిగిస్తున్నాడు. శాంతిని అనుగ్రహిస్తున్నాడు. సౌఖ్యాన్ని ప్రసాదిస్తున్నాడు. మన్మథుని మర్దించినవాడు. అట్టి మృడుని (శివుని) ఉపాసిస్తున్నాము.





శ్లో॥ శ్రితదిగమ్బరం చికురితామ్బరం
కాలకన్ధరం భావబన్ధురమ్ ।
భువనసున్దరం వైరిణాం దరం
రతపురన్దరం హరముపాస్మహే॥ **79**

శ్రితదిగంబరమ్ = ఆశ్రయించిన దిక్కులను వస్త్రముగ చేసుకొన్నవాడు, చికురిత + అంబరమ్ = కురులగ చేసుకొన్న ఆకాశం కలవాడు, కాలకంధరమ్ = నల్లని (విషపు) మెడ గలవాడు, భావబంధురమ్ = చక్కని భావం గలవాడు, భువనసుందరమ్ = లోకాలలో సుందరుడు, వైరిణామ్ = శత్రువులకు, దరమ్ = భయంకరుడు, రతపురందరమ్ = ఇంద్రునకు ప్రీతికలిగించిన వాడు, అయిన, హరమ్ = హరుణ్ణి, ఉపాస్మహే = ఉపాసింతుము.

ఆయన దిగంబరుడు. ఆకాశాన్నంతా జటాజూటంగా మలుచుకొన్నాడు. నల్లనిమెడతో, భువనమోహనంగా, శత్రుసంహారం చేస్తూ ఇంద్రసఖుడై సకల భావస్థానమై ఒప్పారుచున్న హరుణ్ణి (శివుణ్ణి) ఉపాసిస్తున్నాము.





**శ్లో॥ వేదబోధితం వినయసాధితం**
**జన్మతారిణం కర్మహారిణమ్ ।**
**విధిముఖామరైః సతతసంస్తుతం**
**విశ్వకారణం భవముపాస్మహే ॥ 80**

వేదబోధితమ్ = వేదములచే తెలియబడువాడు, వినయసాధితమ్ = భక్తిచే పొందబడువాడు, జన్మతారిణమ్ = పుట్టుకలేకుండగ చేయువాడు, కర్మహారిణమ్ = కర్మలను హరింప చేయువాడు, విధిముఖామరైః = బ్రహ్మమొదలైన దేవతలచే, సతతమ్ = ఎల్లపుడు, సంస్తుతమ్ = పొగడబడినవాడు, విశ్వకారణమ్ = ప్రపంచమునకు కారణభూతుడయిన, భవమ్ = శివుణ్ణి, ఉపాస్మహే = ఉపాసింతుము.

వేదాలవలన ఆయన తత్త్వం అవగతమౌతుంది. యమనియమాదుల నాచరిస్తే ఆయనను సాధింపవచ్చును. ఆయన జన్మచక్రంనుండి విముక్తిని కలిగిస్తాడు. కర్మను హరిస్తాడు. బ్రహ్మాదిదేవతలు ఆయనను నిత్యం స్తుతిస్తారు. ఆయన విశ్వమునకు మూలకారణం. ఆ భవుణ్ణి (శివుణ్ణి) ఉపాసిస్తున్నాము.





**శ్లో॥ గణ్డోపాన్తనికుఞ్జితస్మితభరం కైవల్యభూషాయితం**
**వీణాగానరసాకులం గిరిసుతాశ్లేషోత్సవాసఙ్గినమ్ ।**
**ఢక్కానాదితశబ్దశాస్త్రవిషయం ప్రాతస్సరస్సఞ్చలత్-**
**శ్వేతస్ఫీతకుశేశయోపమతనుం నాగేన్ద్రకృత్తిం నుమః ॥ 81**

గండ + ఉపాంత నికుంజిత స్మితభరమ్ = చెక్కిళ్ళను పొంతలో ఉన్న చిఱునవ్వుతో నిండినది, కైవల్యభూషాయితమ్ = మోక్షం భూషణంగా కల, వీణాగానరసాకులమ్ = వీణాగానరసముతో ఒప్పారు, గిరిసుతా + ఆశ్లేష + ఉత్సవ + ఆసంగినమ్ = పార్వతీయొక్క కౌగిలింతయను వేడుకకు ఆసక్తిచూపు, ఢక్కానాదిత శబ్దశాస్త్రవిషయమ్ = డమరుకానాదమునుండి వ్యాకరణశాస్త్రమునకు కారణమైన, ప్రాతస్సరస్సంచలత్శ్వేతస్ఫీతకుశేశయోపమతనుమ్ = వేకువవేళ సరస్సులో కదలాడు తెల్లనైన విశాలమైన పద్మము వంటి (తెల్లనైన) శరీరం కల, నాగేంద్రకృత్తిమ్ = గజచర్మధారిని, నుమః = నమస్కరించుచున్నాము.

ఆయన చెక్కిలి చిఱునవ్వుతో వెలుగారుతున్నది. కైవల్యం ఆయనకు భూషణంగా ఉన్నది. వీణాగానరసాస్వాదంలో లీనమై ఉన్నాడు. పార్వతీపరిరంభంతో ఆనందాన్ని పొందుతున్నాడు. ఢక్కను మ్రోగిస్తూ ఆ నాదంతో వ్యాకరణాన్ని సృజించినాడు. ప్రాతఃకాలవేళ సరోవరంలో కదలాడే విప్పారిన తెల్లని కమలపుష్పాల వంటి శరీరంతో శోభిస్తున్నాడు. ఆయన గజచర్మాన్ని ధరించినాడు. ఆయనను స్తుతిస్తున్నాము.





శ్లో॥ వీతరాగిణమముం న జానతీ
యౌవనోదయవిభిన్నమన్మథా ।
తస్య నాట్యకలనాభికర్షితా
క్లిశ్యతే వనతలీషు కిన్నరీ ॥ 82

వీతరాగిణమ్ = ఏరాగములేని, అముమ్ = ఈశ్వరుణ్ణి, న జానతీ = తెలియనిదయిన, కిన్నరీ = కిన్నరస్త్రీ, యౌవన + ఉదయ విభిన్న మన్మథా = యౌవనారంభంచే వికసించిన కామవికారంగలదియై, తస్య = ఈశ్వరునియొక్క, నాట్యకలనాభికర్షితా = నాట్యకళకు ఆకర్షితురాలై, వనతలీషు = వనస్థలిలో, క్లిశ్యతే = కష్టపడుచున్నది. (విరహబాధపడుచున్నది.)

ఆయన విరాగి అని తెలియక, ఆయన నాట్యమునకు ముగ్ధురాలై యౌవనసహజమైన కామభావంతో వనతలంలో కిన్నరి క్లేశాన్ని అనుభవిస్తున్నది.





శ్లో॥ కుముదబాన్ధవహారిజటాయుతం
కువలయావనముగ్ధమృదుస్మితమ్ ।
గిరిసుతాప్రణయార్పితజీవితం
విజయతాం మమ వాఙ్మయవల్గితమ్ ॥ 83

కుముదబాంధవ... యుతమ్ : కుముద = కలువలకు, బాంధవ = బంధువైన చంద్రుని, హారి = పొందిన, జటాయుతమ్ = జడటలతో కూడినది, కువలయ... స్మితమ్ : కువలయ = భూమండలమును, అవన = రక్షించు, ముగ్ధ = సుందరమైన, మృదు = కోమలమైన, స్మితమ్ = నవ్వుగల, మమ = నాయొక్క, గిరి... జీవితమ్ : గిరిసుతా = పార్వతీదేవికి, ప్రణయ = ప్రేమతో, అర్పిత = ఇవ్వబడిన, జీవితమ్ = జీవితంగల, వాఙ్మయ వల్గితమ్ = వాఙ్మయమైన చమత్కార భాషణం, విజయతామ్ = విజయించుగాక!

ఆయన జటలు వెన్నెలకాంతి నిండారి ఉన్నాయి. ఆయన చిఱునవ్వు కమలపుష్పాల్లాగా మృదువుగా ఉన్నది. పార్వతీప్రణయానికి ఆయన జీవితం అర్పితమైంది. నా వాఙ్మయంలో నాట్యం చేసే ఆ మహస్సు విజయమగుగాక!





**శ్లో॥ నయనైస్సురాఙ్గనానా-**
**మభిపీతమనుక్షణం స్పృహాతరళైః ।**
**హిమనగసానువిహారే**
**విభావయే కిమపి కిమపి తారుణ్యమ్ ॥ 84**

సురాంగనానామ్ = దేవతాస్త్రీల, అనుక్షణమ్ = ప్రతిక్షణము, స్పృహాతరలైః = కోరికతో చంచలమైన, నయనైః = నేత్రాలతో, అభిపీతమ్ = ఆసక్తితో గ్రోలబడినది, హిమనగసానువిహారే = హిమవత్పర్వతసానువులందు విహరించుటయందు, కిమ్ + అపి = అనిర్వచనీయమైన, తారుణ్యమ్ = శివుని యౌవనాన్ని, విభావయే = భావిస్తున్నాను.

దేవతాస్త్రీలు కోరికనిండిన తమ కనుచూపులతో అనుక్షణం అభిలషించేదీ, హిమాచల సానువులలో విహరించేదీ, వర్ణింపరానిదీ ఐన ఆ శివతారుణ్యాన్ని భావిస్తున్నాను.





శ్లో॥ తష్టూషన్తీ కిఞ్చిదధ్యాత్మతత్త్వం
పారమ్పర్యం ప్రాక్తనానాం మునీనామ్ ।
ముగ్ధేవాన్తర్లజ్జయా గాహ్యమానా
జ్ఞాతేఽప్యర్థే వాగ్విమూఢత్వమేతి ॥ 85

ప్రాక్తనానామ్ = ప్రాచీనులైన, మునీనామ్ = మునులకు, పారంపర్యమ్ = పరంపరాప్రాప్తమైన, కిమ్ + చిత్ = అనిర్వచనీయమైన (ఏదో తెలియరాని), అధ్యాత్మతత్త్వమ్ = ఆత్మయొక్క (యథార్థతన) తత్త్వాన్ని, తుష్టూషంతీ = స్తుతింపగోరిన, వాక్ = వాక్కు, అంతః = లోన, లజ్జయా = సిగ్గుతో, గాహ్యమానా = మునిగిపోవుచున్న, ముగ్ధా + ఇవ = ముగ్ధానాయికవలె, జ్ఞాతే + అపి + అర్థే = తెలిసిన విషయమైనా, మూఢత్వమ్ = మోహమును, ఏతి = పొందుచున్నది.

ప్రాచీనమునిపరంపరచే అనుగ్రహింపబడిన అధ్యాత్మతత్త్వాన్ని నిరంతరం స్తుతింప గోరుతూ, తెలిసిన విషయాన్నైనా వ్యక్తం చేయడానికి నిండిన లజ్జతో వెనుకాడే ముగ్ధవలె నా వాక్కు విమూఢంగా ఉన్నది.





శ్లో॥ మధురిమకణికా మమాఽస్తు చిత్తే
మదనమహీపతిమానమర్దనశ్రీః ।
మునిజనహృదయేషు శం దుహానా
రసతీ వా విధుచన్ద్రకం దధానా ॥ 86

మదనమహీపతిమానమర్దనశ్రీః = మన్మథరాజుయొక్క గర్వమును అణిచే శుభకరమైనది, మునిజన హృదయేషు = మునిజనుల హృదయాలలో, శమ్ = శుభాన్ని, దుహానా = పిండునది, విధుచంద్రకమ్ = చంద్రుని వెన్నెలను, రసతీ – వా = స్రవించుచున్నదాన్నట్లున్న దానిని, దధానా = ధరించునది, అయిన, మధురిమ కణికా = మాధుర్యపు లేశము, మమ = నాయొక్క, చిత్తే = మనస్సులో, అస్తు = ఉండుగాక!

అది మన్మథుని గర్వాన్ని మర్దించిన శుభకరమైన కాంతి. మునిజనులకు సౌఖ్యాన్ని కూర్చేది. చంద్రకళను ధరించేది. ఆ మాధుర్యలేశము నా చిత్తము నందుండుగాక!





శ్లో॥ ప్రణయలులితగౌరీపీనవక్షస్స్థితాభ్యాం
ప్రతిపదలలితాభ్యాం పాటలీపాటలాభ్యామ్ ।
అతిమధురగతిశ్రీప్రస్నువత్పద్ధతిభ్యాం
శివపదనలినాభ్యాం చిత్తమాతున్దిలం నః ॥ 87

ప్రణయ... స్థితాభ్యామ్ : ప్రణయలులిత = ప్రేమతో తాకిన, గౌరీ = పార్వతియొక్క, పీన = బలిసిన, వక్షఃస్థితాభ్యామ్ = ఉరమందున్న, ప్రతిపదలలితాభ్యామ్ = ప్రతిపదం సుందరమైన, పాటలీపాటలాభ్యామ్ = పాటల కుసుమం వలె ఎఱుపురంగు కలవి, అతిమధురగతి = మిక్కిలి మధురమైన నడకతో, శ్రీప్రస్నువత్ = సంపదను స్రవించు, పద్ధతిభ్యామ్ = మార్గముగల, శివపదనలినాభ్యామ్ = శివుని పాదపద్మములు; నః = మాయొక్క, చిత్తమ్ = మనస్సును, ఆతుందిలమ్ = పూర్తిగ నిండిపోయినది.

ప్రణయంలో గౌరీస్తనాలను స్పృశించేవి ప్రతి అడుగునూ సున్నితంగా వేసేవీ, పొగడపూవులవలె ఎఱుపురంగు కలిగినవీ, అతిమృదువైన నడకతో మార్గంనిండా కాంతిని నింపేవీ ఐన శివపదకమలములతో నా మనస్సు నిండిపోయింది.





శ్లో॥ సన్నిధత్తాం హృది స్వర్ధునీకఙ్కణ-
వ్రాతముక్తామయస్ఫీతజూటాఙ్కితమ్ ।
కిన్నరీవల్లకీగానసంనాటితం
భక్తివాఙ్మణ్డనైర్జ్యోతిరాసేవితమ్ ॥ **88**

స్వర్ధునీకంకణ… కితమ్ : స్వర్ధునీకంకణ = గంగానదియొక్క నీటికణాల, వ్రాత = సముదాయము, ముక్తామయ = ముత్యాలతో ఏర్పడిన, స్ఫీత = విశాలమైన, జూటా = జటలతో, అంకితమ్ = కూడినది, కిన్నరీవల్లకీగానసంనాటితమ్ = కిన్నరీ స్త్రీల వీణాగానంతో నర్తించినది. భక్తివాఙ్మణ్డనైః = భక్తితో నిండిన వాక్కులనే అలంకారాలతో, ఆసేవితమ్ = సేవింపబడినది, అయిన, జ్యోతిః = వెలుగు, హృది = మనస్సులో, సంనిధత్తామ్ = నిలుచుగాక!

గంగానదీతరంగబిందువులే ముత్యాలుగా అలంకృతమైన జటాజూటంతో కిన్నరకాంతల వీణాగానానికి అనుగుణంగా నాట్యం చేస్తూ భక్తిస్తోత్రాలే భూషణాలుగా సేవింపబడే శివజ్యోతిస్సు నా హృదయమునందు వసించుగాక!





**శ్లో॥ వక్షసి విపులం నయనే చపలం**
**హృదయే లలితం దయయా కలితమ్ ।**
**నిర్జరదయితాప్రణయప్రసరత్-**
**స్మితపరిదిగ్ధం జ్యోతిరుపాసే ॥ 89**

వక్షసి = వక్షస్థలంలో, విపులమ్ = విశాలమైనది, నయనే = కంటిలో, చపలమ్ = చంచలమైనది, హృదయే = మనస్సులో, లలితమ్ = సుందరమైనది, దయయా = దయతో, కలితమ్ = కూడినది, నిర్జర... దిగ్ధమ్ : నిర్జర దయితా = దేవకాంతల, ప్రణయ ప్రసరత్ = ప్రేమతో ప్రసరించు, స్మిత = చిఱునవ్వుతో, పరిదిగ్ధమ్ = కూడినది అయిన, జ్యోతిః = తేజస్సును, ఉపాసే = ఉపాసించుచున్నాను.

విశాలమైన వక్షఃస్థలంతో, చపలమైన నేత్రాలతో, దయాపరిపూర్ణమైన హృదయంతో, దేవకాంతల ప్రణయమందహాసంతో వెలుగొందే జ్యోతిస్సును ఉపాసిస్తున్నాను.





శ్లో॥ భక్తసారఙ్గసంహ్లాది
పరానన్దవధూద్వహమ్ ।
జ్ఞానోదయపరిస్ఫీతం
భాతి శైవం సితామ్బుజమ్ ॥ 90

భక్తసారంగసంహ్లాది = భక్తులను తుమ్మెదలకు ఆనందం కలిగించునది, పరానంద వధూ + ఉద్వహమ్ = మోక్షానందమను కాంతను ధరించునది, జ్ఞానోదయ పరిస్ఫీతమ్ = తెలివి కలగగానే విప్పారునది, శైవమ్ = శివుదను, సితాంబుజమ్ = తెల్లటి పద్మము, భాతి = వెలుగొందుచున్నది.

భక్తులనే తుమ్మెదలకు ఆహ్లాదం కలిగించేదీ, మోక్షకాంత తన కబరీభరంలో ధరించేదీ, జ్ఞానోదయం కాగానే వికసించేదీ ఐన శివరూప శ్వేతపద్మం వెలుగుతున్నది.





శ్లో॥ సమాధివిఘ్నాయ కదా ను మే భవే-
దహీన్ద్రకోటీరవికాసిమస్తకమ్ ।
దయారసస్యన్దివిశాలలోచనం
ప్రసాదరమ్యాననమైశ్వరం మహః ॥ 91

అహీంద్రకోటీరవికాసిమస్తకమ్ = నాగేంద్రుని కిరీటంతో ప్రకాశించే శిరస్సు కలది, దయారసస్యంది = కృపారసమును స్రవించు, విశాలలోచనమ్ = పెద్ద కన్నులుగలది, ప్రసాదరమ్యాననమ్ = అనుగ్రహంతో అందమైన ముఖం కలది, అయిన, ఐశ్వర్యమ్ = ఈశ్వరుని, మహః = తేజస్సు, మే = నాయొక్క, సమాధివిఘ్నాయ = సిద్ధివిఘ్నాన్ని, కదా ను భవేత్ = ఎప్పుడు కలిగించునో కదా!

మహాసర్పాలే కిరీటంగా ప్రకాశించే మస్తకంతో కృపాభరితమైన విశాలనేత్రాలతో, ప్రసన్నమైన ముఖంతో వెలుగొందే ఈశ్వరతేజస్సు ఆవిష్కృతమై నా తపస్సమాధిని ఎప్పుడు భగ్నం చేస్తుందో?





శ్లో॥ కష్టముష్టింపచః కోఽపి సంవర్తతా-
మార్ద్రమఞ్జుస్మితస్విన్నగణ్డస్థలః ।
సంయమివ్రాతవాటీషు యో యాచతే
ప్రేమభిక్షాం ధురి ప్రేయసీవఞ్చితః ॥ 92

ఆర్ద్ర... స్థలః : ఆర్ద్ర = తడిసిన, మంజు = మనోహరమైన, స్మిత = చిఱునవ్వుతో, స్విన్న = తడిసిన, గండస్థలః = చెక్కిలి భాగం కలవాడు, ప్రేయసీవంచితః = ప్రియురాలిచే మోసగింపబడినవాడు, కష్టముష్టింపచః = మిక్కిలి దరిద్రుడు అయిన, కః + అపి = మాటలకందరాని వాడు, అయిన శివుడు, ధురి = నాముందు, సంవర్తతామ్ = ఉంటూ, ప్రేమభిక్షామ్ = ప్రేమబిచ్చమును, యాచతే = యాచించును (గాక!)

సుకుమారమైన మందహాసంతో, ప్రేయసీవంచితుడెవడో నిష్కించనుడై మునివాటికల ద్వారసీమల ముందు ప్రేమభిక్షను యాచిస్తున్నాడు. ఆయన నా ముందు కన్పించుగాక!





**శ్లో॥ నాహం శక్తో వినిర్జేతు-**
**మిన్ద్రియగ్రామముద్ధరమ్ ।**
**సుఖీ సుఖే తు నిక్షిప్యే**
**లేశం పైనాకతేజసః ॥** **93**

ఉద్ధరమ్ = బలమైన, ఇంద్రియగ్రామమ్ = ఇంద్రియాల సముదాయాన్ని, వినిర్జేతుమ్ = గెలుచుటకు, అహమ్ = నేను, న శక్తః = సమర్థుడను కాను, తు = కాని, సుఖీ = సుఖినై, పైనాకతేజసః = పినాకపాణియైన శివతేజస్సుయొక్క, లేశమ్ = లేశభాగాన్ని, సుఖే = నా సుఖంలో, నిక్షిప్యే = నిలుపుకొందును.

బలమైన ఇంద్రియ సమూహాన్ని జయించే శక్తి నాకు లేదు. సుఖినై నా సుఖంలో ఆ శివతేజస్సును కాస్త నిలుపుకుంటాను. (నిక్షేపిస్తాను)





శ్లో॥ చుమ్బతు మన్మతిమాదర-
చలుకితనయనో భుజఙ్గకోటీరః ।
వ్యపనీయ మానవసనం
ప్రతిపదమనువర్తిముక్తిశృఙ్గారః ॥ **94**

భుజంగకోటీరః = విటశ్రేష్ఠుడు (సర్పభూషణుడు), ఆదరచులుకితనయనః = ప్రేమతో పుక్కిళించిన కన్నులు కలవాడయి, మత్ + మతిమ్ = నా మతి (నాయికను), చుంబతు = ముద్దిడుగాక!, మానవసనమ్ = అభిమానమనే వస్త్రమును, వ్యపనీయ = తొలగించి, ప్రతిపదమ్ = అడుగడుగున, అనువర్తి = అనుసరించు, ముక్తిశృంగారః = ముక్తికాంతాశృంగారుడు అగుగాక!

సర్పాలే కిరీటంగా వెలుగొందే ఆ స్వామి సాదరముగా నా మనస్సును స్పృశించుగాక! శృంగారపరవశమై ముక్తికాంత లజ్జనువదిలి ఆయన వెంట అడుగులో అడుగునిడుతూ నడుస్తున్నది.





శ్లో॥ సోఽయం లయానుగుణవర్తితపాదపద్మ-
మఞ్జీరమఞ్జుతరపుఞ్జితశిఞ్జితేన ।
మూర్ధాభిషిక్తపదవీం శ్రవసోర్వితన్వ-
న్నానన్దవార్ధిరివ మానసమభ్యుపైతి ॥ 95

లయా... శింజితేన : లయానుగుణ = లయకు తగినట్టుగ, వర్తిత = నాట్యముచేయు, పాదపద్మ = పద్మమువంటి పాదములయొక్క, మంజీర = నూపురాల, మంజు = మనోహరమైన, పుంజిత = రాశియగు, శింజితేన = నినాదముచే, శ్రవసోః = చెవికి, మూర్ధాభిషిక్తపదవీమ్ = పట్టాభిషేకపదవిని, వితన్వత్ = విస్తరింపచేయుచు, సః + అయమ్ = ఆ శివుడు, ఆనందవార్ధిః + ఇవ = ఆనంద సముద్రం వలె, మానసమ్ = (నా) మనస్సును, అభి + ఉపైతి = వచ్చి చేరుచున్నాడు.

లయానుగుణంగా పాదపద్మాలను కదిలిస్తూ మధురమైన అందెల సవ్వడితో వీనులకు మూర్ధాభిషేకపదవిని కలిగిస్తూ ఆనందసముద్రంవలె ఈయన నా మనస్సును నిండిపోయినాడు.





శ్లో॥ గౌరీనఖముఖరిత-
వీణాగానానురూపభావభరమ్ ।
నన్దివిమర్దితమర్దల-
మసృణితమానన్దరూపమాయాతి ॥ 96

గౌరీ... భరమ్ : గౌరీ = పార్వతియొక్క, నఖముఖరిత = గోరులతో మీటిన, వీణాగాన = వీణాగానమునకు, అనురూప = తగిన, భావభరమ్ = భావంతో నిండిన, నందివిమర్దిత = నంది మ్రోగించిన, మర్దల = మృదంగమునకు, మసృణితమ్ = నిండినది అగు, ఆనందరూపమ్ = ఆనందమాకృతి చెందినవాడు, శివుడు, ఆయాతి = (నావద్దకు) వచ్చుచున్నాడు.

పార్వతీదేవి వీణాగానమునకు అనుగుణమైన భావమును మనస్సున నింపుకొని నందీశ్వరుడు మ్రోయించిన మద్దెలసవ్వడికి ఆనందమునందిన ఆ శివుడు (నన్ను) సమీపిస్తున్నాడు.





**శ్లో॥ మమ వర్త్మని ఖేలతాం విభు**
**ర్మదరాగాకులగణ్డమణ్డలః ।**
**మదయన్ మమ మానసం ముహు-**
**ర్ముహురాశ్లేషసుఖోపబృంహితమ్ ॥ 97**

ఆశ్లేషసుఖ + ఉపబృంహితమ్ = ఆలింగనసుఖంతో పెల్లుబికిన, మమ = నాయొక్క, మానసమ్ = మనస్సునుగూర్చి, ముహుః + ముహుః = మరలమరల, మదరాగాకుల = మదరాగముచే ఆకులమైన (పర్చిన) వ్యాప్తమైన, గండమండలః = గుండ్రని చెక్కిళ్ళు గలవాడగుచు, మదయన్ = మత్తును గూర్చుచు, మమ = నాయొక్క, వర్త్మని = మార్గంలో, ఖేలతామ్ = క్రీడించుగాక!

మాటిమాటికీ నా మనస్సుని ఆలింగనం చేసి మైమరిపిస్తూ చెక్కిళ్ళపై మదరాగం ఒప్పారగా, నా మార్గము నందు శివుడు క్రీడించుగాక!





శ్లో॥ పఞ్చాక్షరీపరమపావనమన్త్రవర్ణ-
తల్పస్థితే విమలశీతలదేహగేహే ।
నిర్వాణసీమ్ని మమ జీవితరఙ్గనాథే
ప్రాదుర్భవన్తి ధురి చేతసి కేఽపి భావాః ॥ **98**

పఞ్చాక్షరీ... స్థితే : పఞ్చాక్షరీ = ఐదు అక్షరాలు గల, పరమపావన = మిక్కిలి పవిత్రమైన, మంత్రవర్ణ = మంత్రవర్ణములు కల, తల్పస్థితే = శయనమందుండగ, విమల... గేహే : విమల = (మలరహితమైన) నిర్మలమైన, శీతల = చల్లనైన, దేహగేమే = దేహమనే గృహంలో, నిర్వాణసీమ్ని = మోక్షమనే సీమలో, మమ = నాయొక్క, జీవితరంగనాథే = జీవితరంగమునకు ప్రభువుండగ, చేతసి ధురి = మనస్సులో, కే + అపి = గొప్ప చెప్పనలవికాని, భావాః = భావములు, ప్రాదుర్భవన్తి = ఆవిర్భవించుచున్నవి.

పరమపవిత్రమైన మంత్రాక్షరాలతో వెలుగొందే పంచాక్షరియే తల్పంగా ప్రశాంతమైన దేహమనే ఇంటిలో నా జీవితరంగానికి అధినాథుడై మోక్షసీమగా ఒప్పారు ఈశ్వరుని సన్నిధిలో నా మనస్సునందు వివరింపరాని భావాలు ఉద్భవిస్తాయి.





శ్లో॥ మస్తన్యస్తసుధాంశుహస్తవిగలత్పీయూషధారాభరో
బాహూదీర్ణపృదాకునాయకశిరోమాణిక్యనీరాజితః ।
ప్రేమార్ద్రాచలనన్దినీస్మితఝరీరోచిస్సమాలిఙ్గితః
కోఽయం కైతవభిక్షుకో హిమగుహావీథీమితో గాహతే ॥ **99**

మస్త... భరః : మస్త = తలపై, న్యస్త = ఉంచిన, సుధాంశు = చంద్రునియొక్క, హస్త = కిరణములనుండి, విగలత్ = స్రవించుచున్న, పీయూషధారాభరః = అమృతధారలతో నిండినవాడు, బాహూ... నీరాజితః : బాహు = బాహువులకు, ఉదీర్ణ = అలంకారముగానున్న , పృదాకునాయక = సర్పరాజుయొక్క, శిరోమాణిక్య = తలమానికముచే, నీరాజితః = హారతి ఇవ్వబడినవాడు, ప్రేమా... సమాలింగితః : ప్రేమార్ద్ర = ప్రీతితో తడిసిన, అచలనందినీ = పార్వతియొక్క, స్మితఝరీ = చిఱునవ్వుల లహరియొక్క, రోచిస్సమాలింగితః = కాంతులతో కౌగిలింపబడిన వాడు, కోః + అయమ్ = ఎవరీ, కైతవభిక్షుకః = కపటపు బిచ్చగాడు, ఇతః = ఇటుగ, హిమాలయవీథీమ్ = మంచుకొండ వీథులలో, గాహతే = తిరుగుచున్నాడు.

జటాతలంలో నడయాడే చంద్రునికిరణాలు అమృతధారను నింపగా, బాహువులపై ఆభరణాలుగా ఉన్న మహాసర్పాల శిరస్సులపై వెలిగే మణులు నీరాజనవిధిని నిర్వహింపగా, పార్వతీమందహాసకాంతి శరీరాన్నంతా వ్యాపించగా ఈ కపటభిక్షువు ఎవడో హిమాచల గుహల్లో తిరుగాడుచున్నాడు.





**శ్లో॥ ఉదీతే కాకోలే జలధిభరితే ధూమపటలీ**
**సురాణాం సందోహేఽ వితథబలహాహారవయుజి ।**
**తదా సంజగ్రాహ ప్రథితమహిమా యో హాలాహలం**
**ధునోతు ధ్వాన్తం నస్సకలజగదీశః పశుపతిః ॥ 100**

కాకోలే = విషము, ఉదీతే = పైకి వచ్చుచుండగ, ధూమపటలీ = పొగ దట్టముగ, జలధిభరితే = సముద్రమంతా క్రమ్మగ, సురాణామ్ = దేవతల, సందోహే = గుంపు, అవితథబల = బలంలేనివారగుచు, హాహారవయుజి = హా... హా...కారములు కలవారు కాగా, తదా = అప్పుడు, ప్రథితమహిమా = ప్రసిద్ధమైన గొప్పదనం కల, యః = ఏ శివుడు, హాలాహలమ్ = హాలాహలాన్ని, సంజగ్రాహ = బాగుగ గ్రహించెనో, సకలజగదీశః = సమస్తలోకాలకు ప్రభువైన, పశుపతిః = పశుపతి, నః = మనయొక్క, ధ్వాన్తమ్ = అజ్ఞానాంధకారాన్ని, ధునోతు = పారద్రోలుగాక!

సముద్రాన్ని కప్పివేస్తూ దట్టమైన పొగ వ్యాపింపగా, దేవతలందరూ హాహాకారాలు చేస్తూ ఉండగా, కాకోల విషం ఉద్భవించింది. ఆ హాలాహలాన్ని మహామహిమాన్వితుడైన ఈశ్వరుడు తనలోనికి లాగుకున్నాడు. సకలజగదీశుడైన ఆ పశుపతి మన హృదయము లందున్న చీకటిని పారద్రోలుగాక!





**శ్లో॥ కల్యాణానాం నిధానం వసనితగగనం గణ్డసమ్భిన్నహాసం**
**చఞ్చచ్చన్ద్రాభిరామం శ్రుతిశతయువతీదోహదం రాగహేతోః ।**
**మూలం ధర్మద్రుమస్య ప్రసృమరకరుణం ముక్తికాన్తాభుజఙ్గం**
**తం వన్దే నీలకణ్ఠం మదనమదహరం మాధురీస్థానమేకమ్ ॥ 101**

కల్యాణానామ్ = శుభాలకు, నిధానమ్ = గని (నిధి), వసనిత గగనమ్ = ఆకాశమును వస్త్రముగ గలవాడు, గండసంభిన్నహాసమ్ = చెక్కిళ్ళయందు వ్యాపించిన నవ్వుగలవాడు, చంచత్ – చంద్ర + అభిరామమ్ = ప్రకాశించే చంద్రునితో అందమైనవాడు, రాగహేతోః = అనురాగంచేత, శ్రుతి శతయువతీదోహదమ్ = వందల శ్రుతియువతులకు కోరికలు తీర్చువాడు, ధర్మద్రుమస్య = ధర్మమను చెట్టుకు, మూలమ్ = వేరు, ప్రసృమరకరుణమ్ = నిండయిన దయ కలవాడు, ముక్తికాంతాభుజంగమ్ = ముక్తికాంతకు విటుడు, మదనమదహరమ్ = కాముని మదమణచినవాడు, మాధురీస్థానమ్ = మాధుర్యానికి నెలవు, ఏకమ్ = అద్వితీయుడు అయిన, తం నీలకంఠమ్ = ఆ కాలకంఠుని, వందే = నమస్కరించుచున్నాను.

ఆయన కల్యాణనిధి. ఆకాశాన్ని అంబరంగా ధరించినవాడు, గండస్థలంలో మందహాసంతో ఒప్పారేవాడు. వెలుగొందే చంద్రవంకతో అందంగా కన్పించేవాడు, ఉపనిషత్కాంతలను రంజింపచేసేవాడు, ధర్మవృక్షానికి మూలమైన వాడు, దయారసాన్ని పై జల్లెడువాడు, మోక్షకాంతాప్రియుడు. మన్మథుని మదాన్ని హరించినవాడు. మాధుర్యగుణమునకు స్థానమైన వాడు. ఆ నీలకంఠునికి నమస్కరించుచున్నాను.





**శ్లో॥ హైమవతీమణికాఞ్చీ-**
**కలకిఙ్కిణినాదసుభగదరహాసమ్ ।**
**పూర్వార్ధభాగపర్యా-**
**క్రమణోత్సుకవామమీశ్వరం వన్దే ॥ 102**

హైమ... హాసమ్ : హైమవతీ = పార్వతీదేవియొక్క, మణికాంచీ = మణుల వడ్డాణపు, కలకింకిణినాద = మధురమైన మువ్వల ధ్వనివలె, సుభగ = అందమైన, దరహాసమ్ = చిఱునవ్వుగలవాడు, పూర్వా... వామమ్ : పూర్వ + అర్ధభాగ = మొదటి సగభాగం యొక్క, పర్యాక్రమణ = పూర్తిగ ఆక్రమించుటయందు, ఉత్సుకవామమ్ = వేడుకగలిగిన సుందరిని కలవాడు, అయిన, ఈశ్వరమ్ = శివుణ్ణి (అర్ధనారీశ్వరుణ్ణి), వందే = నమస్కరించుచున్నాను.

ఆయన దరహాసం పార్వతీదేవి ధరించిన కాంచీదామమణికింకిణీనాదంవలె మనోహరంగా ఉన్నది. అర్ధనారీశ్వరరూపంలో పూర్వభాగాన్ని వామభాగం ఆలింగనం చేసికొనుటకు ఉత్సాహపడుతున్నది. అట్టి ఈశ్వరునికి నమస్కరించుచున్నాను.





**శ్లో॥ అధీతమపి యచ్ఛాస్త్రం**
**నాధీతమివ భాసతే ।**
**యస్య తత్త్వావబోధేన**
**తం నుమస్సర్వరూపిణమ్ ॥** **103**

యస్య = ఏ పరమేశ్వరునియొక్క, తత్త్వావబోధేన = తత్త్వము అవగతమైనచో, అధీతమ్ + అపి = అధ్యయనం చేసిన దయినను, యత్ + శాస్త్రమ్ = ఏ (ఇతర) శాస్త్రమంతా, న + అధీతమ్ + ఇవ = చదవని దానివలె, భాసతే = భాసిల్లునో, తం సర్వరూపిణమ్ = ఆ సర్వస్వరూపుణ్ణి, నుమః = నమస్కరింతుము.

ఎవని తత్త్వాన్ని తెలుసుకుంటే, శాస్త్రాధ్యయనం యావత్తూ అనధీతప్రాయమై అప్రకృతమౌతుందో అట్టి సర్వస్వరూపుని స్తుతించుదము.





**శ్లో॥ ఆపీనజూటపరికీలితగాఙ్గనీర-**
**తారఙ్గగీతసుఖకుట్మలితాబ్జనేత్ర! ।**
**శ్రీచంద్రశేఖర! దయాఫలితావతార!**
**కైవల్యపూర! కృపణే కరుణాం విధేహి ॥ 104**

ఆపీన... నేత్ర! : ఆపీన = బాగా లావైన, జూట = జటల మధ్య, పరికీలిత = బిగించి పట్టిన, గాంగనీర = గంగాజల, తారంగ = తరంగముల, గీత = గానమునకు, సుఖ = సుఖము(గ)తో, కుట్మలిత = అరవిరిసిన, అబ్జనేత్ర! = పద్మాలవంటి కన్నులుగల, శ్రీచంద్రశేఖర! = శ్రీయుత శశిశేఖర!, దయాఫలితావతార! = దయకు ఫలముగ అవతరించినవాడా!, కైవల్యపూర! = మోక్షమునొసంగువాడా!, కృపణే = దీనుడయిన నాయందు, కరుణామ్ = దయను, విధేహి = ఉంచుము.

లావైన జటలమధ్య బిగించిపట్టిన గంగాజల తరంగధ్వని గీతానికి పరవశించి అరమోడ్పుకనులతో ఆనందించే దయాపూర్ణడవైన చంద్రశేఖరా! మోక్షదాతా! ఈ దీనుని దయతో వీక్షించు.





శ్లో॥ అధీనం సాహిత్యం కఠినతపసా లబ్ధమతులం
కవిత్వశ్రీర్వశ్యా సరసతరశబ్దార్థసుభగా ।
విభాతి స్వచ్ఛన్దా మతిరపి చ శాస్త్రేష్వతితరాం
పరం శాన్తిశ్శమ్భో! కృపణమనసా నాధిగమితా ॥ 105

కఠినతపసా = కఠోరమైన తపస్సుతో, అతులమ్ = సాటిలేని, సాహిత్యమ్ = సాహిత్యశాస్త్రం, అధీనమ్ = వశపడినది, సరసతరశబ్దార్థసుభగా = రసవత్తరమైన శబ్దముల – అర్థములతో సుందరమైన, కవిత్వశ్రీః = కవిత్వ సంపద, వశ్యా = స్వాధీనమైనది, శాస్త్రేషు = వ్యాకరణాది శాస్త్రములందు, అతితరామ్ = మిక్కిలి, స్వచ్ఛందా = స్వేచ్ఛగ, మతిః = బుద్ధి, విభాతి = రాణించుచున్నది, శంభో! = శివా!, కృపణమనసా = దీన మనస్సుతో, పరం శాంతిః = మిక్కిలి శాంతి, న + అధిగమితా = సమకూడలేదు.

శివా! కఠినమైన తపస్సుతో అసమానసాహిత్యం స్వాధీనమైంది. రసాన్వితములైన శబ్దార్థాలతో సుందరమైన కవితాసంపద వశమైంది. శాస్త్రవిద్యాకౌశలం పట్టుపడింది. కాని ఈ దీనునికి శాంతి సమకూడలేదు.





శ్లో॥ రత్నాఞ్చితాఙ్గదయుగీముఖరీకృతాఙ్ఘ్రిం
వాచ్యార్థకల్పనవిధౌ కలితాబ్జహస్తమ్ ।
భావానురూపపరికమ్పితతారహారం
సన్ధ్యాప్రవర్తిశివతాణ్డవమాద్రియామః ॥ **106**

రత్నాంచిత... తాంఘ్రిమ్ : రత్నాంచిత = మణులు పొదిగిన, అంగదయుగీ = అంగదముల జంటయొక్క, ముఖరీకృత = ధ్వనులు చేయు, అంఘ్రిమ్ = పాదములుగల, వాచ్యార్థకల్పనవిధౌ = చెప్పదలచిన అర్థమును అభినయించు విధానంతో, కలితాబ్జహస్తమ్ = అందమైన కరపద్మములు కల, భావానురూప... హారమ్ : భావానురూప = భావమునకు తగిన విధంగ, పరికంపిత = కదలుచున్న, తారహారమ్ = తారహారాలుగ, సంధ్యాప్రవర్తి = సంధ్యవేళలో చేయు, శివతాండవమ్ = శివతాండవము, ఆద్రియామః = ఆదరించుదాం.

రత్నాంగదాల ధ్వనిచే విలసిల్లేపాదాలతో వాచ్యార్థాన్ని అభినయించే హస్తపద్మాలతో భావానురూపంగా కదులుతున్న తారహారాలతో ఒప్పారే సంధ్యాకాల శివతాండవాన్ని స్తుతించుదాం.





**శ్లో॥ సంపుల్లస్థలపద్మాభా-**
**వుత్తానస్థానశోభినౌ ।**
**సమాధిస్థమహేశస్య**
**కరౌ తామ్రతలౌ నుమః ॥ 107**

సంపుల్లస్థలపద్మాభౌ = విప్పారిన మెట్టతామరవంటివి, ఉత్తానస్థానశోభినౌ = ఉత్తానస్థానంతో శోభిల్లునవి, తామ్రతలౌ = రాగిరంగు గలవి, సమాధిస్థ మహేశస్య = సమాధిలో నున్న ఈశ్వరుని, కరౌ = చేతులను, నుమః = స్తుతింతుము.

సమాధిస్థుడైన శివుని విప్పారిన హస్తాలు సంపూర్ణంగా వికసించిన మెట్ట తామరల వలె తామ్రవర్ణంతో శోభిస్తున్నాయి. వాటిని స్తుతించుదాం.





శ్లో॥ ఉత్తానతారతరలం
నిశ్చలీకృతమణ్డనమ్ ।
చిత్రీకృతశరీరం త-
చ్ఛివధ్యానసుఖం స్తుమః ॥ 108

ఉత్తానతారతరలమ్ = పైకెత్తిన కనుపాపలు గలిగి, నిశ్చలీకృతమండనమ్ = నిశ్చలముగ శోభిల్లునది, చిత్రీకృతశరీరమ్ = బొమ్మగా చేయబడిన శరీరముగల, తత్ + శివధ్యానసుఖమ్ = ఆ శివుని ధ్యాన సుఖాన్ని, స్తుమః = స్తుతించుదుము.

ఊర్ధ్వదృష్టితో ప్రకాశిస్తూ చిత్తరువులోవలె నిశ్చలంగా ఉన్న శివుని ధ్యానసుఖాన్ని స్తుతించుదాము.





**శ్లో॥ ఆత్మానమాత్మనావేక్ష్య**
**విహసన్తం ముహుర్ముహుః ।**
**ముకులీకృతనేత్రాబ్జ-**
**మాదిదేవముపాస్మహే ॥ 109**

ఆత్మనా = తనచేత, ఆత్మానమ్ = తనను, ఆవేక్ష్య = ఆవేశింపచేసుకొని, ముహుః + ముహుః = మరల మరల, విహసంతమ్ = నవ్వుకొను, ముకులీకృతనేత్రాబ్జమ్ = మొగ్గలుచేయబడిన నేత్ర పద్మములు గల, ఆదిదేవమ్ = తొలిదేవతను (శివుణ్ణి), ఉపాస్మహే = ఉపాసించుదుము.

స్వాత్మావలోకనంలో ఆనందమందహాసంచేస్తూ నిమీలితనేత్రుడైన ఆదిదేవుని ఉపాసించుదము.





శ్లో॥ దాక్షాయణీకుచతటీకృతపత్రభఙ్గ-
సఙ్క్రాన్తిపల్లవితమాంసలపీనవక్షాః ।
రక్షాపరో గుణవతాం చ సురాసురాణాం
శమ్భుః పునాతు శ్రుతిగీర్వనితావసన్తః ॥ 110

దాక్షాయణీ... వక్షాః : దాక్షాయణీ = పార్వతీదేవియొక్క, కుచతటీ = స్తనతటములందు, కృత = తాకిన (పూసిన), పత్రభంగ = కస్తూరికాదులచే, సంక్రాంతి = అంటిన, పల్లిలిత = ఎఱుపుగ, మాంసల = పుష్టిగల, పీన = బలమైన, వక్షాః = ఉరము కలవాడు, గుణవతామ్ = గుణవంతులయిన, సురా + అసురాణామ్ = దేవరాక్షసులకు, రక్షాపరః = రక్షాదక్షుడు, శ్రుతిగీర్వనితావసంతః = వేదవాక్కులకు శిరోభూషణుడు అయిన, శంభుః = శివుడు, పునాతు = రక్షించుగాక!

పార్వతీస్తనపత్రభంగసంసర్గంతో ఆయన వక్షఃస్థలం ఎఱుపెక్కింది. దేవరాక్షసులను, గుణవంతులను రక్షిస్తాడు. వేదసరస్వతికి వసంతం లాంటివాడు. అట్టి శంభుడు (మనలను) పావనం చేయుగాక!





**శ్లో॥ నన్దీశ్వరప్రహితచాటుకథానుకూల-**
**సఞ్చాలిమస్తకనటన్మృదుచన్ద్రరేఖమ్ ।**
**రేఖారథాఙ్గసరసీరుహముద్రితాఙ్ఘ్రిం**
**భూతేశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥ 111**

నందీశ్వర... చంద్రరేఖమ్ : నందీశ్వర = నందీశ్వరునిచే, ప్రహిత = చేయబడిన, చాటుకథా = ప్రియమైన కథలకు, అనుకూల = తగినట్లు, సంచాలి = కదులు, మస్తకనటత్ = తలయందున, మృదు = మెత్తనైన, చంద్రరేఖమ్ = చంద్రరేఖా, రేఖారథాంగసరసీరుహముద్రితాంఘ్రిమ్ = చక్రము – పద్మము ముద్రల పాదములుగల, భూతేశ్వరమ్ = భూతపతిని, కదా = ఎపుడు, విలోకయిష్యే = చూడగలను, ను = కదా!

నందీశ్వరుని స్తుతిగీతాలను వింటూ ఆనందంతో శిరఃకంపనం చేస్తున్నాడు. అందుకే శిరస్సుపై నున్న చంద్రరేఖ కదలాడుచున్నది. కమలము రథాంగము ఆదిగాగల శుభకరమైన సాముద్రిక రేఖలతో ఆయన పాదాలు శోభిస్తున్నాయి. ఆయన భూతేశ్వరుడు. ఆయనను నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?





శ్లో॥ దన్తావలాసురతనుస్రుతశోణశోణి-
తాక్తం కపోలయుగలం దధతం పురాణమ్ ।
బీభత్సకాన్తమమరీకృతచాటువాదం
సర్వేశ్వరం హృది కదా ను విలోకయిష్యే॥ **112**

దంతావలా.... తాక్తమ్ : దంతావల + అసుర = గజాసుర, తనుస్రుత = శరీరం నుండి కారిన, శోణశోణిత = రక్తముతో ఎఱ్ఱదనంతో, ఆక్తమ్ = కూడిన, కపోలయుగలమ్ = గండభాగాలు, దధతమ్ = ధరించినవాడు, పురాణమ్ = ప్రాచీనమమైనవి, భీభత్సకాంతమ్ = భయంకరమైనా రమ్యమైనది, అమరీకృతచాటువాదమ్ = దేవతాస్త్రీలు చేయు స్తోత్రపాఠంగల, సర్వేశ్వరమ్ = అంతటకీ నియంత అయిన శివుణ్ణి, కదా ను = ఎపుడు, విలోకయిష్యే = చూడగలను.

గజాసురుని సంహరింపగా చిమ్మిన రక్తంతో ఆయన కపోలాలు తడిసి ఎఱ్ఱనైనాయి. రూపం బీభత్సంగా కన్పిస్తున్నది. దేవతాస్త్రీలు స్తోత్రపాఠాలను గానం చేస్తున్నారు. ఆయన సర్వేశ్వరుడు. ఆయనను నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?





శ్లో॥ హేరమ్బలమ్బశ్రుతిశూర్పరతాలవృన్త-
సఞ్జాతవాతవిధుతాలకకేశభారమ్ ।
మారాఙ్కురగ్రసనభాస్కరఫాలనేత్రం
గౌరీశ్వరం హృది కదా ను విలోకయిష్యే ॥ 113

హేరంబలంబ.... భారమ్ : హేరంబ = వినాయకుని, లంబశ్రుతిశూర్పర = వ్రేలాడే చేట చెవులు అను, తాళవృంత = వింజామర వలన, సంజాత = పుట్టిన, వాత = గాలికి, విధుత = కదలింపబడిన, అలకభారమ్ = జడలుగలవాడు, మారాంకుర... నేత్రమ్ : మార = మన్మథుడనే, అంకుర = మొలకను, గ్రసన = గ్రసించే, భాస్కర = వేడిగల, ఫాలనేత్రమ్ = నొసట కన్ను కలవాడు, అయిన, గౌరీశ్వరమ్ = పార్వతీపతిని, కదా = ఎపుడు, విలోకయిష్యే ను = చూడగలుగుదునో కదా!

గణపతి శూర్పకర్ణాలతో విసరగా ఆ గాలికి ఆయన జటాజూటం కాస్త కదులుతున్నది. ఆయన మూడవకంటి వలన కలిగిన మండుటెండ మన్మథుడనే అంకురాన్ని మాడ్చివేస్తున్నది. ఆయన గౌరీపతి. ఆయనను నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?





శ్లో॥ కల్పద్రుపల్లవసదృక్ఛవిమత్కటాక్ష-
విభ్రాన్తకోణపకరాఞ్జలియుక్తపాదమ్ ।
యోగీశ్వరాభ్యుదితహర్షితసామవేదం
నాదేశ్వరం హృది కదా ను విలోకయిష్యే ॥ 114

కల్పద్రు... పాదమ్ : కల్పద్రు = కల్పవృక్షం యొక్క, పల్లవ సదృక్ = చిగురుటాకులతో సమానమైన, ఛవిమత్ = కాంతిగల, కటాక్ష = క్రీగంటి చూపులకు, విభ్రాంత = చకితులైన, కోణప = రాక్షసుల, కరాంజలియుక్త = దోసిళ్ళతో కూడిన, పాదమ్ = పాదాలుగల, యోగీశ్వరా... వేదమ్ : యోగీశ్వర = యోగీశ్వరులకు, అభ్యుదిత హర్షిత = కలిగిన ఆనందంగల, సామవేదమ్ = సామవేదమైన, నాదేశ్వరమ్ = నాదమునకు ప్రభువైన శివుణ్ణి, కదా ను = ఎపుడో గదా!, విలోకయిష్యే = చూడగలుగుదును.

కల్పవృక్షం చివురుటాకుల కాంతికలిగిన కటాక్షాలకు విభ్రాంతులైన రాక్షసులు ఆయన పాదాలకు అంజలి ఘటిస్తున్నారు. యోగీశ్వరులు ఆనందంతో సామగానం చేస్తున్నారు. నాదేశ్వరుడైన ఆ శివుని నేనెప్పుడు దర్శించుకోగలుగుతాను?





శ్లో॥ గజాసురమహాదన్త-
కుణ్ఠబాధాం వినిర్మమే ।
యస్యాట్టహాసప్రచయా-
స్తం స్మరామో మహానటమ్ ॥ 115

గజాసుర... బాధామ్ : గజాసుర = ఏనుగురక్కసుని, మహాదంత = పెద్దకోరలచే, కుంఠబాధామ్ = గాయబడుటచే గలిగిన బాధను, యస్య = ఏ శివునియొక్క, అట్టహాసప్రచయాః = అట్టహాసపు గుంపులు (రాశులు), వినిర్మమే = ఏర్పరచినవో, తమ్ = అట్టి, మహానటమ్ = మహానటుడయిన శివుణ్ణి, స్మరామః = తలచుదుము.

ఆయన అట్టహాసాలు గజాసురమహాదంతంతో ఏర్పడిన పోటుబాధను వ్యక్తం చేస్తున్నవి. అట్టి మహానటుని స్మరించుదాం.





**శ్లో॥ పతతు నభస్త్రుటతు మహీ**
**లుఠన్తు గిరయశ్చలన్తు వారిధయః ।**
**వయమద్య న భీతాః**
**కాశీపతిరస్తి కా శుచా మనసః ॥ 116**

నభః = ఆకాశం, పతతు = పడిపోవుగాక, మహీ = నేల, త్రుటతు = చీలిపోవుగాక, గిరయః = కొండలు, లుఠన్తు = దొర్లిపోవుగాక, వారిధయః = సముద్రాలు, చలంతు = ఊగిపోవుగాక, అద్య = ఇపుడు, వయమ్ = మేము, న భీతాః = భయపడము, కాశీపతిః = కాశికాధీశ్వరుడు, అస్తి = ఉన్నాడు, మనసః = మనస్సుకు, శుచా కా = శోకమెక్కడిది?

ఆకాశం పడిపోనీ, భూమి ముక్కలు కానీ, పర్వతాలు జారిపోనీ, సముద్రాలు కదిలిపోనీ, మేమిప్పుడు భయపడం. కాశీపతి ఉండగా మనస్సుకి బాధ ఎక్కడిది?





శ్లో॥ కామినీగణ్డయుగలీ-
పాణ్డోర్నిజతనుత్విషః ।
సంస్మరామః పురారాతేః
పునరుక్తీకృతం స్మితమ్ ॥ 117

కామినీ... త్విషః : కామినీ = కామవిరహంతో ఉన్న స్త్రీ యొక్క, గండయుగళీ = రెండు చెక్కిళ్ళు, పాండోః = తెల్లనైన, నిజతనుత్విషః = తన శరీరకాంతిని, పునరుక్తీకృతమ్ = రెట్టింపుచేసిన, పురారాతేః = త్రిపురారియొక్క, స్మితమ్ = నవ్వును, సంస్మరామః = బాగుగా తలచుదుము.

ఆయన శరీరకాంతి కామినీగండస్థలంవలె తెల్లగా ఉన్నది. ఆయన మందహాసం ఆ తెల్లదనాన్ని ద్విగుణీకృతం (పునరుక్తం) చేస్తున్నది. ఆ పురారాతిని (శివుణ్ణి) స్మరించుదాం.





**శ్లో॥ యా ప్రేమమణ్డనవతీ కృపయా సనామ్నీ**
**మచ్చిత్తసీమపరతత్త్వమయం చకార ।**
**తాం మన్మహే వికసితోత్పలపత్రలీలాం**
**సౌధారసీమభినవామివ తుల్యశీలామ్ ॥ 118**

ప్రేమమండనవతీ = ప్రేమయే అలంకారముగ గలది, కృపయా = దయతో, సనామ్నీ = పేరు గలది అయిన, యా = ఏ శివభావన, మత్ + చిత్త సీమ = నా చిత్తపు సీమను, పరతత్త్వమయమ్ = గొప్ప తత్త్వంతో నిండినట్లు, చకార = చేసెనో, వికసితోత్పల పత్రలీలామ్ = వికసించిన కలువ రేకుల వలె, (మృదువైన) విలాసం గల, సౌధారసీమ్ = అమృతరసాన్ని, అభినవామ్ + ఇవ = నిత్యనూతనం వలె, తుల్యశీలామ్ = శివసదృశమైన, తామ్ = ఆ శివభావనను, స్మరామి = తలచుదును.

ప్రేమయే అలంకారంగా, దయయే పేరుగా, అమృతరసంవలె మధుర స్వభావమై వికసించిన కమలపుష్పములవలె మనోహరంగా ఉన్న ఆ శివతత్త్వాన్ని భావిస్తున్నాను.





శ్లో॥ వర్ధతాం శివసాహిత్య-
మాకల్పం నిర్నిబన్ధనమ్ ।
సాయఙ్కాలసమాఫుల్ల-
మల్లీపుష్పోపమద్యుతి ॥ 119

సాయం... ద్యుతి : సాయంకాల = సాయంసంధ్యలో, సమాఫుల్ల = బాగా వికసించిన, మల్లీపుష్ప = మల్లెపూలతో, ఉపమ = పోల్చదగిన, ద్యుతి = కాంతిగల, శివసాహిత్యమ్ = శివుని వాఙ్మయము, ఆకల్పమ్ = ప్రళయాంతం వరకు, నిర్నిబంధనమ్ = స్వతంత్రంగా, వర్ధతామ్ = వర్ధిల్లునుగాక!

సాయంకాలంలో వికసించిన మల్లెపూవులవలె వెలుగొందే శివసాహిత్యం స్వతంత్రంగా కల్పాంతం దాకా వర్ధిల్లుగాక!





**శ్లో॥ శివేన దత్తం సాహిత్యం**
**శివాయైవ నివేదితమ్ ।**
**వర్షన్తి హి పయో మేఘాః**
**పునస్తత్రైవ వార్ధిజమ్ ॥ 120**

శివేన = శివునిచే, దత్తమ్ = ఇవ్వబడిన, సాహిత్యమ్ = వాఙ్మయమము, (హితముచేయు శబ్దార్థము) శివాయ + ఏవ = శివుని కొఱకే, నివేదితమ్ = నివేదింపబడినది, మేఘాః = మేఘాలు, వార్ధిజం పయః = సముద్రపు నీటిని, పునః = మరల, తత్ర + ఏవ = ఆ సముద్రమునందే, వర్షంతి = వర్షించుచున్నవి, హి = కదా!

సముద్రం నుండి జలాన్ని గ్రహించి మేఘాలు మళ్ళీ అక్కడే వర్షించినట్లుగా శివుడనుగ్రహించిన సాహిత్యాన్ని శివునికే నివేదించినాను.





శ్లో॥ అష్టాక్షరీజపపరాయణమానసేన
శైవాగమాకలనపుష్కితసమ్భ్రమేణ ।
నారాయణేన రచితం నవచన్ద్రభూష-
కర్ణామృతం జయతు కామగవీసదృక్షమ్ ॥ 121

అష్టాక్షరీ... మానసేన : అష్టాక్షరీ = నారాయణునికి సంబంధించిన ఎనిమిది అక్షరాల మంత్రమును, జపపరాయణ = జపించుటలో, ఆసక్తికల, మానసేన = మనస్సుకల, శైవాగమా... సంభ్రమేణ : శైవాగమ = శైబాగమములను, ఆకలన = బాగుగ తెలియుటచే గలిగిన, సంభ్రమేణ = సంభ్రమము గల, నారాయణేన = నారాయణ (నామధేయుని) చే, రచితమ్ = వ్రాయబడిన, నవచంద్ర... కర్ణామృతమ్ : నవచంద్ర = నూతన చంద్రుడు, భూష = అలంకారంగల, కర్ణామృతమ్ = చెవికింపైన అమృతము, కామగవీసదృక్షమ్ = కామధేనువుతో సమానమైనదిగ, జయతు = విజయిల్లుగాక!

అష్టాక్షరీ జపపరాయణమనస్కుడు, శైవాగమాలను ఆపోశనం పట్టినవాడు ఐన నారాయణుడు వ్రాసిన ప్రతిపచ్చంద్రకలాశోభితశివకర్ణామృతము కామధేనువు వంటిది. జయించుగాక!

